# దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు ?

తాపి ధర్మారావు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
ఏలూరురోడ్డు, విజయవాడ-2

## సూచిక :

రచనకోసం నేను సంప్రదించిన

## కొన్ని పరిశోధక గ్రంథాలు


*Lordy Avebury* : Origin of Civilizations etc.

*Robert Briffault* : The Mothers.

*Ernest Crawley* : The Mystic Rose.

*Abbe Dubois* : Description of character etc , of the people of India.

*Sir J. G. Frazer* : Golden Bough volumes.

*E. S. Hartland* ; Phallicism

*William G. Sumner* : Social Sciences.

*Dr. James Hastings* : Encyclopaedia of Religion & Ethics.

*Edgar Thurston* · Castes and Tribes of Southern India.

*O. A. Wall* : Sex Worship.

*E. A. Westermark* : History of Human Marriage.

*H. Ellis* : Psychology of Sex.

*John Woodroffe* : Shakti and Shakta.

*Eric John Dingwall* : Male Infibulation.

*George R. Scott* : Phallic worship.

# పీఠిక

## ( మూడవ ముద్రణ )

తరచుగా చూస్తూనే ఉన్నాము — ప్రత్యక్షంగా కాకపోయినా, పత్రికలలోనైనా — చూస్తూనే వున్నాము. ఒకచోట కాలువ త్రవ్వుతుంటే కొన్ని శిథిలాలు కనబడ్డాయనీ, ఇంకెక్కడో భూగర్భంలో కొన్ని పురాతన కాలపు అవశేషాలు కనపడ్డాయనీ, చూస్తూనే ఉన్నాము.

గత మాసం రష్యా మధ్యప్రదేశంలో త్రవ్వుతూ వుంటే బౌద్ధ స్థూపం శిథిలాలూ, కొన్ని శిల్పాల ముక్కలూ కనిపించాయి.

15 రోజులకు పూర్వం పూనా సమీపంలో 5000, 6000 సంవత్సరాలనాటి పురాతన అవశేషాలు దొరికాయి.

ఈలాంటి పురాతన వస్తుపరిశోధనలలో ఆరితేరిన మహా మేధావులు వాటిని అధ్యయనం చేసి, అవి ఏ కాలానివో, ఏ జాతి (తెగ) వారికి సంబంధించినవో ఆ జాతి వారి సంస్కృతి ఎలాటిదో...అంతా ప్రకటిస్తారు, అలాంటి మేధావుల మూలంగానే మనకు మొహంజదారో, హరప్పా, నాగార్జునకొండ, మొదలైన పురాతన విశేషాలు లభించాయి.

అద్భుతమైన దీక్ష మేధాశక్తిగల పాశ్చాత్య పరిశోధకులు నూరు, మూటయాభై సంవత్సరాలకు పూర్వమే తూర్పుదేశాల పురాతన విశేషాలు

పరిశోధన చేసి అనేక గ్రంథాలు ప్రచురించారు. వారి పరిశ్రమల ఫలితం గానే ఫినిషియా, క్రీట్, మయ, మెసపటోమియా, ఖాల్డియా, బాబిలో నియా మొదలైన ప్రాచీన (అనగా కొన్ని వేల సంవత్సరాలనాటి) జాతులవారి నాగరికత (సంస్కృతి) గురించి మనకు ఈపాటి అయినా తెలిసింది.

ఆ యా ప్రాచీన సంస్కృతులు చాలవాటిలో గూడ స్త్రీల స్వామ్యమూ, సంభోగ స్వేచ్ఛా, దేవతారాధనకు సంభోగమే ముఖ్యసాధన అన్న అభి ప్రాయమూ—అవి స్ఫుటంగా కనిపిస్తాయి. దేవాలయాలు ఆ విధంగా క్రీడా మందిరాలుగా వుండేవని లిఖితపూర్వకమైన లెక్కలున్నాయి. సంభో గము పవిత్రమైన దైవశక్తికి సూచన. దానిని జరపనివారు పాపులు అన్న మాట, మూడునాలుగు వేల సంవత్సరాలనాడు అటువంటి అభిప్రాయాలతో ఆ యా జాతులవారు జీవించారంటే, ఇప్పుడు సిగ్గుపడవ మెందుకు। సంతా నాభివృద్ధికి సంభోగ కార్యము ఉపకరించలేదా। అలాగనే ప్రకృతి ... చెట్టూ, చేమా అధిక ఫలవంతం అవడానికి ఆ కార్యక్రమమే అవలంబించే వారు. తప్పేముంది.

ఆ కారణం చేతనే స్త్రీ పురుష గోప్యాంగాలు ప్రజలకు పూజార్హా లయినాయి. వాటిలో బహుళ వ్యాప్తిలో ఉన్నది ఈశ్వరలింగారాధన. అభి మానం—కాదు దురభిమానం—కొద్దీ ఆ లింగానికి ఏమేమో నిర్వచనలు చెప్పుతూ మసిపూసి మారేడుకాయ చేయడానికి మన ప్రబుద్ధులు ప్రయత్ని స్తుంటారు. అటువంటి వారికి "హరవిలాసము" అన్న కావ్యంలో ఉన్న వివరణ. కనువిప్పు కాగలదు. దాపరికం ఏమీ లేకుండా ఆ లింగ మహా త్మ్యము ప్రకటించడానికి మనపూర్వులు శ్రమపడ్డారు. దానిని కాదని మన వారు సాధించిన మహోన్నత విశేషము ఏమిటో తెలియదు, హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకు, జలలింగం, వాయులింగం, అగ్నిలింగం, జ్యోతిర్లింగం—ఇలాగ ఎన్నో భక్తి భావపూరితాలయిన పేరులతో పూజలు చేస్తూ ఉన్న మన కోట్లాది భారతీయులూ అవివేకులేనా ?

పానవట్టానికి స్త్రీ గోప్యాంగ ఆకారాన్నివ్వటంతో సంతృప్తి చెందారా మనవారు ? ఇరుకురాళ్ళ రూపంగా వాటి మహిమను ప్రకటించి, ప్రజలను వాటిగుండా నడిపిస్తూండలేదా ? అప్పటికీ తృప్తి కలగలేదు. కాబట్టి అలంపురములాంటి క్షేత్రలలో యోని (భగ)పూజకు ఒక ప్రత్యేక గౌరవంకూడా కల్పించారు కాదా ! అక్కడకు వచ్చి అత్యంత భక్తి ప్రపత్తులతో పూజలుచేస్తూ ఉన్న స్త్రీ పురుష ప్రజానహస్రాలు మూర్ఖులేనా ?

ఆనాడు (5000 సంవత్సరాలనాడు ఆ ప్రజలకులేనిదీ, ఈనాడు దీక్షతో వచ్చి పూజలుచేస్తూ ఉన్న మన ఆ బాల గోపాలానికి లేనిదీ ఈ సిగ్గూ, దానివల్ల కలిగిన దురభిమానమూ మన "సభ్య" మిత్రులకు ఎందుకుండాలి ? రాతి రాగి శాసనాలలోనూ, కావ్యాలలోనూ, పురాణాల్లోనూ— విశేషించి భారతీయ హృదయాలలోనూ ఇంత కాలంగా ఈ సత్యం కోడయి కూస్తూ ఉండగా కాదనడానికి మన వారికేమీ అధికారముంది? ఈ సత్యాన్ని అంగీకరించినట్టయితే వీరికి కలిగే నష్టం ఏమిటి ?

గోప్యాంగా లనగానే ఒక విధమైన సిగ్గూ,కొంత అసహ్యమూ కలిగితే కలుగును గాక ! సత్యాన్ని అసత్యంగా సర్దుబాటు చేయడానికి ప్రయత్నించటం"మన సభ్య మేధావులకు" తగని పని అనక తప్పదు. గోప్యాంగాలంటే అసహ్యించుకోవలసిం దేమీ లేదు. మన ఉపనిషత్తులలో కొన్నిటిలో ఈ గోప్యాంగాలకు మన పూర్వులు చాల గౌరవం ఇచ్చారు. బృహదారణ్యక ఉపనిషత్తులో "స్త్రీ అధోభాగం (ఉపస్థను) యజ్ఞవేదిగా భావించ వలసిందనీ, అక్కడుండే బహిశ్చర్మమునూ,రోమాదులనూ యజ్ఞ సంబంధమయిన వివరణలతో మహా పవిత్రమయిన విషయాలుగా భావించ వలసిందనీ సూచించారు. సంభోగసమయంలో ఈ విషయాలు జ్ఞాపకముంచుకున్నవారు వాజపేయ యజ్ఞం చేసినవారి పుణ్యం పొందుతారని అన్నారు.

పెద్దలెంతోమంది చూస్తూండగా "పబ్లిక్‌గా" సంభోగించడం చూచాము. గుర్రంతో అశ్వమేధయాగాలు నడపడం చూచాము. యజ్ఞం చేస్తూన్న వారి భార్యను ఇంకొకడు మదన క్రీడకు పిలుచుకు పోవడం చూచాము—అప్పుడులేని సిగ్గూ, దురభిమానమూ ఇప్పుడు మన కెందుకు తగదు. గోపురాలమీద, రథాలమీద, గర్భగుడి విమానాలమీదా, కోవెల గోడలమీదా లక్షల సంఖ్యనున్న ఈ బూతుబొమ్మలు కనిపించకుండా చేయడం సాధ్యమైతే మన సంస్కర్తలు ఆ పనికి పూనుకోవడం మంచిది. అది పూర్తిగా సాధ్యం కాదేమో, లేకపోతే, కళ్ళతోపాటు నోరుకూడా మూసుకొని అదంతా ఒక స్వప్నంగా భావించి ఆ అధ్యాయం మరచి పోవడం ఉత్తమం. పాత పడినంత మాత్రాన సత్యం అసత్యం కాదుకదా! సెలవు

హైద్రాబాద్,
31 మార్చి 1971.

తాపీ ధర్మారావు

# విన్నపం!

## ( రెండవ ముద్రణ )

ధర్మరాజు రాజసూయ యాగంలో బ్రాహ్మణోత్తములకు జింకమాంసము తోనూ, ఆవుమాన మాంసంతోనూ సంతర్పణలు చేశారంటే. ఇప్పుడు వాంతి చేసుకొనే ఆచారవంతులున్నారు. భర్త చూస్తూ ఉండగా భార్యను ఎవ్వడో ఒకడు సంభోగించడానికి తీసుకుపోయాడంటే, సచేల స్నానం చేసే పెద్దలున్నారు కాలాన్నిబట్టి ఆచారాలూ, అభిప్రాయాలు మారుతూ ఉంటాయన్న సత్యం తెలియక కాదు. దురభిమానం విడిచిపెట్టుకోలేకే. అలాటివారి సంతతివారమే మనము అన్న విషయాన్ని అంగీకరించడానికి మనసొప్పకే

ఇలాంటివారు మనలోనే కాదు, సర్వత్రా ఉన్నారు సాధారణులే కాదు, విజ్ఞాన ఘనులయి పరిశోధనలు చేసేవారుగూడా కొందరున్నారు ఆరంభ దశలో-సృష్టి మొదటి దినాలలో - స్త్రీ పురుషులు వావివరుసలు లేకుండా ప్రవర్తించేవారిని ఎన్ని నిదర్శనాలు చూపినా అంగీకరించలేని వారున్నారు అలాంటి దెప్పుడూ ఏ ప్రాంతంలోనూ లేదని ఆ పరిశోధకులు వ్రాశారు గూడ. ఆ వ్రాతలు చూచి మనవారు గూడా కాదనడానికి ప్రయత్నించారు

కాని, ఇటీవల పరిశోధకులకు దొరికిన ఆధారాలవల్ల వారి అభిప్రాయం తప్పు అని రూఢి అయింది. మన పురాణాలనుబట్టి స్త్రీ పురుష

సంబంధాలు ఎన్ని రకాలుగా ఉన్నాయో తెలుసుకోవచ్చును వావివరస లేని అవస్థనుంచి నేటి రిజిష్టరు వివాహము వరకు ఉన్న అంతస్తులన్నీ వాటిలో కనబడతాయి. మహాభారత కాలమునాడు గూడ ఈ స్వేచ్ఛ ఆచారంలో ఉన్నదనడానికి శల్యుడి మద్రరాజ్యమే సాక్ష్యము.

శల్యుడు కర్ణుడికి రథసారథ్యం చేస్తూ కర్ణుడి మనసును నొప్పి కలిగించే మాటలాడతాడు. కర్ణుడు శల్యుడి పరువు బజారున పెడతాడు. సంస్కృత భారతంలో ఈ అధిక్షేపణ చాల విపులంగా ఉంది. తిక్కన కవిగారు ఆ తిట్లను సూక్ష్మీకరించి -

"వావివరుసలు లేక వనితలు పురుషులు

కలియుచుంట యెగ్గుకాదు మీకు .. "

అనిమాత్రం చెప్పారు దురభిమానానికి పోకపోతే, దీని పట్టయినా ఆనాటి స్థితిని అంగీకరించవచ్చునే. కాలక్రమ పరిణామాలను గుర్తించలేక పోయినా ఈ ప్రమాణాన్ని అంగీరించాలి కదా ! భారతీయ నాగరికత యందు గౌరవం మనకంటే తిక్కన్నకు తక్కువ అనలేము కదా ! అంగీకరించక తప్పదు

## స్త్రీ అధికారము

వావివరుసలేని ఈ స్థితిని ఎప్పుడంగీకరించామో అప్పుడే 'ఆరంభదశలో స్త్రీలదే అధికారం' అన్న సంగతిని గూడా అంగీకరించాలి. తండ్రి ఎవ్వడో తెలియనప్పుడు తల్లి పేరువనేకదా జీవించాలి! స్త్రీ ఆధిక్యముండిన స్థితి ఎప్పుడూ లేదని అనడం సాహసం. ఎవరవినా అనవచ్చునేమో కాని. ఆంధ్రులం మనం అనలేము. మన చారిత్రక పురుషులు శాతకర్ణులు 'గౌతమీపుత్ర శాతకర్ణి' అనీ 'వశిష్ఠీపుత్ర శాతకర్ణి' అనీ ప్రఖ్యాతిపొందిన

వారు. ఇందులో గౌతమీవశిష్ఠ అని తల్లుల పేరులతోనే వ్యవహారముంది గాని పురుషుల (తండ్రుల) పేరులతో కాదు. అంత ఎందుకు? సుప్రసిద్ధ చక్రవర్తి చంద్రగుప్తుడెవరు? మౌర్య వంశస్థుడు; అనగా మురా అన్న స్త్రీ సంతతివాడు కాదా? దీనినిబట్టి ఆ దినాలవరకు గూడా మన దేశంలో స్త్రీ ఆధిక్యము ఆచారములో ఉండేదని రూఢే కదా! ఇటీవల పరిశోధకులు సంగ్రహించిన అనేక రుజావులు ఈ సిద్ధాంతాన్నే నిర్ణయిస్తున్నాయి.

## దేవాలయాల గురించి

ఇలాంటి నిర్ణయాలే దేవాలయాలను గురించి చేశారు. కొందరు పరిశోధకులు కాదని చేసిన వాదనల నన్నిటిని పూర్వపక్షం చేసి ఖండించారు. తండోపతండాలుగా దొరుకుతున్న సాక్ష్యాలను అంగీకరించక తప్పదుకదా! ఇప్పటికీ దేవాలయాంలోని నిర్మాణంలోనూ, ఆచారాలలోనూ ఉన్న అభిప్రాయాలను విస్పష్టగా లేచి చెప్పవలసిన అవసరం ఉంది కదా!

మన దేశం దేవాలయాలకు ప్రసిద్ధి. మన నాగరకతా, సంస్కృతీ, మంచి చెడ్డలూ అన్నీ ఈ దేవాలయాలతో సంబంధించినవే. వీటివల్లనే మనలో - ఆసేతు శీతనగమూ - జాతీయ ఐక్యత కలిగింది. వీటివల్లనే మత విద్వేషాలతో పోట్లాడుకున్నాము. వీటిలో ఉంచిన ధనాని కాశపడే ఎందరో మనమీద దండెత్తి వచ్చారు. వీటి ప్రాకారాలలోనే వేలకొద్ది కుటుంబాలు కష్ట సమయాలలో తలదాచుకొనేవారు. మన శిల్పం, చిత్రలేఖనం, నృత్యం, సంగీతం, అన్నిటికీ యీ దేవాలయాలే ఆధారంగా వుండేవి. ఈ విధంగా మన మంచికీ చెడ్డకీ ఉపకరించిన వీ దేవాలయాలు.

కొన్ని వేల సంవత్సరాలనాడు కట్టిన దేవాలయాలు ఉన్నాయి. ఇప్పుడిప్పుడు శాస్త్ర సమ్మతంగా కడుతున్న గుళ్ళున్నాయి. హిమాలయాల

నుంచి కన్యాకుమారి వరకు ఈ దేవళాల ఉన్నాయి - అన్ని ప్రాంతాల లోను, ఉత్తరాన కోణార్క-దేవాలయంలోనూ, భువనేశ్వరాలయంలోనూ, పూరీ జగన్నాథంలోను, దక్షిణాన సింహాచలంలోను, కంచి, మధుర, శ్రీరంగం, అజంతా, ఎలిఫెంటా గుహాలయాలలోనూ- అన్నింటా- ఈ బూతుబొమ్మ ఉన్నాయి. ఆ యా దేశాలు శిల్పుల చాకచక్యంబట్టీ,విజ్ఞానం బట్టీ ఈ బొమ్మలు చిత్రాతిచిత్రంగా తయారయి వున్నాయి. అమోఘ మైన శిల్ప చాతుర్యం చూచి ఆశ్చర్యపడనివా రుండరు. ఆ దేవళాలలకు సంబంధించిన రథాల మీద, వాహనాలమీదకూడా ఈ బొమ్మ ఉన్నాయి.

ఇంత వ్యాప్తినందిన ఈ బొమ్మలు ఎవడో ఒక చిలిపితనపు శిల్పి చేసిన పని అనలేము. ఎవడో ఒక పోకిరీ వాడు చేసిన పని అని చెప్ప లేము, ఇందరు నిర్మాతలను, ఇంతమంది శిల్పులను ఒక్కదానికి తీసుకు రావడానికి గట్టి కారణం వుండాలి. ఇలా గుండాలి అన్న కట్టుబాటు ఒక టుండాలి.

ఉంది అని మన మంగీకరించాము. కాబట్టే 'ఎందుకు' అని ప్రశ్నిం చాము. ఈ నిర్మాణాలు నేటివి నిన్నటివి కావు. కొన్ని శతాబ్ది సహస్రా బ్దాలనాటివి.ఈ మహాకాల ప్రవాహంలో ఎన్నో ఆచారాలు మారిపోయాయి. ఎన్నో అంతరించిపోయాయి ఎన్నో అభిప్రాయాలు తారుమారయాయి. సత్యాన్ని ఆవరించుకొనిన అసత్యాలూ కనబడతాయి. అసత్యం చుట్టూ మూగిన సత్యాలూ కొన్ని గోచరిస్తాయి. అంతా దాటితెన్నూ లేని కీకరా రణ్యంలాగా వుంటుంది. కాబట్టి సత్యనిర్ణయం సులభంకాదు. అక్కడక్కడ కనిపిస్తున్న ఆచార ఖండాలను, అక్కడక్కడ నిలిచివున్న అభిప్రాయా లను సమన్వయ పరచి వివేకవంతులయిన పరిశోధకులు కొన్ని నిర్ణయాలు చేశారు. వాటిని సక్రమ పరిణామ సూత్రాలతో పరీక్షించారు;ఇటీవల దొరి కిన అపూర్వ ఆధారాలతో మేళవించారు. వాటిని మనము మన ఆచార

వ్యవహారాలతో జోడించి సవ్యమని తోచిన వాటిని యితర సూత్రాలకు లొంగని వాటినీ ఆమోదించక తప్పదు కదా! అసహ్యమైనా అప్రియంగా కనిపించినా, సత్యాన్ని అంగీకరించాలికదా! నిన్నటి నాగార్జునసాగర్ త్రవ్వ కాలు ఆనాటి అశ్వమేధానికి నిదర్శనంగా ఉన్నప్పుడు, అది ఎంత అసహ్య మని ఊహించినా ఒప్పుకోక తప్పుతుందా? నా ఈ వ్యాసాలను ఆ దృష్టితో చూడాలని పాఠకులను ప్రార్థిస్తున్నాను.

## ఈ ముద్రణ

మొదటి కూర్పు పుస్తకాలన్నీ చాల కొద్ది దినాలలోనే అమ్ముడు పోయాయి. అదంతా ఆంధ్ర పాఠకుల ఆదరణే అని ఆనాడే పత్రికా ముఖంగా కృతజ్ఞత ప్రకటించాము. ఇంతలో ఆ యుద్ధం రోజులలో సుప్రసిద్ధ పరిశోధనాచార్యుడు జార్జి రై లేస్కాట్ తన గ్రంథాన్ని ప్రచు రించాడు. దాని వెల ముప్పయి అయిదు రూపాయలు పెట్టాడు. కొని చూచాను. అపూర్వమయిన ఫొటోలతో, మ్యూజియములలోని వస్తువుల చిత్రాలతో, సిద్ధాంతాలను రుజువు చేస్తూ వచ్చాడు. ఆ గ్రంథంలోని విష యం దాదాపు అంతా, నా పుస్తకంలో ఉన్నదే అయి ఉండడానికి చాలా సంతోషించాను. అతని లాగానే, మన శిల్పాల ఫొటోలతోనూ, చిత్రాల తోనూ, చాల ఉదాత్తమయిన ప్రచురణ తీసుకురావాలని ఉద్దేశం కలిగింది. కొంత పని జరిగింది. ఇంకా ఎంతో ఆ యా మ్యూజియములనుంచి సంపా దించవలసి ఉంది.

ఈలోగా సంవత్సరాలు తిరిగిపోయాయి. ఇతర వ్యాసంగం కొంత గా అనారోగ్యం కొంత, మా ఇంటిపేరు "శాపీ" ప్రభావంవల్ల మరికొంత —ఇరవై అయిదు సంవత్సరాలను మించిపోయాయి, ఇప్పుడు ఈపనిలోపడితే,

నా విజయ విలాస వ్యాఖ్యానానికి కాలదోషం పడుతుందేమో అని భయం,. దాని ముద్రణకు ఏర్పాట్లు చేస్తూ వున్నాను.

ఇంతలో బంధుమిత్రు లనేకులు దీని ముద్రణ కోసం ఉత్సాహం చూపించారు. సరే అని కొన్ని మార్పులతోనూ, కొన్ని మార్పులతోనూ దీనిని ప్రచురణకు ఇచ్చాను. సత్యప్రియులయిన ఆంధ్ర మహాశయులు ఈ ప్రచురణనుగూడ సాదరదృష్టితో స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

## ఒక్క మాట

గ్రంథంలోని విషయాలకు ఆధారాలు చెప్పినా, చెప్పకపోయినా, అన్నీ ఆధారాలున్న విషయాలేగాని, కల్పనా విషయాలు కావని మాత్రం మళ్ళీ మళ్ళీ మనవి చేస్తున్నాను. పరిస్థితులు అనుకూలించినట్టయితే ఆ ఉదాత్త ప్రచురణగూడ చేయాలనే వుంది.

అప్పటివరకు సెలవు.

హైదరాబాద్,
అక్టోబర్, 62.

తాపీ ధర్మారావు.

# మనవి

## (మొదటి ముద్రణ)

ఆది నా తత్వంలో వున్న లోపమో, చదువులో వున్న దోషమో శిక్షలో ఉన్న కొరతో తెలియదు. నాకు ప్రశ్నలు విశేషం. దీని అర్థం ఏమిటి? ఇది ఎందుకిలాగుంది? అది లేకపోతేనో? ఇలాంటి ప్రశ్నలు వేలకి వేలు పుడుతూనే వుంటాయి. అది సాహిత్యం కానీయండి, గణిత శాస్త్రం కానీయండి. రాజ్యాంగ విషయం కానీయండి. పుడుతుంది ఏదో ప్రశ్న. కొంటెతనంవల్ల కాదు. ఒకరిని అడుగుదామన్న ఉద్దేశంతో కాద. మరేమో చేదామని కాదు.

సంగతేమిటో తెలియాలనీ. తెలుసుకుందామనీ. అంతే. అదే నాకు మంచిని తెచ్చింది. అదే నన్ను పాడుచేసింది కూడాను.

అలా పుట్టిందే నా కీ ప్రశ్న: దేవాలయాలమీద బూతు బొమ్మ లెందుకు? ఇది పుట్టి చాలా సంవత్సరాలయింది. దానికి అప్పుడప్పుడు కొంచెం కొంచెం సమాధానాలులాంటివి దొరుకుతూ వుండేవి. మరికొంత శోధించేవాడిని. మరికొంచెం చదివేవాడిని. మరికొందరి నడిగేవాడిని. మరికొంత వెలుగు కనబడేది.

ఇలాగ పదిహేనుసంవత్సరాలు జరిగింది. ఈ పరిశోధన అనండి పాటు అనండి దీనిలో చాలా విషయాలు నాకు దొరికాయి. మరికొన్ని కొత్త ప్రశ్నలు పొటకరించాయి.

అప్పుడప్పుడు ఈ విషయాలని గురించే చిన్న కథలోనూ, కొండెకాడులోనూ, ఓనమాలలోనూ, లేకిలోనూ వ్రాస్తూ వుండేవాడిని.

కొంతమంది స్నేహితులతో చర్చిస్తూ ఉండేవాడిని. ప్రశంసించేవారు కొందరు, పరతిట్టేవారు కొందరు. ఎవ రేమి చేసినా, నేను చేసిన ప్రయత్నమంతా హాస్యం కోసమూ, విలాసం కోసమూ కాదవిన్నీ, మహా శ్రద్ధతోనూ చాల పరిశీలనతోనూ చేసినదే అనీ మాత్రం ఒప్పుకొనేవాళ్లు. నిజంగాకూడా నాకు వినోదం అన్న బుద్ధిలేదు. విషయంలో గౌరవమూ, శ్రద్ధా ఉండేవి. కాబట్టి తేలిక బుద్ధి అని మాత్రం మీరు ఊహించవద్దు.

## ఇవ్వాళ్యా ఉన్న భయం :

నేను చెప్పబోయేది చాలామందికి కటువుగా వుంటుంది. అనేకులు సహించలేరు అని నాకు తెలుసును. కొందరు మనసు నొచ్చుకుంటారనీ నాకు తెలుసును. అందుచేతనే ఎంతమందో విద్యాధికులూ, విమర్శకులూ ఈ విషయం ప్రకటించమని నన్ను కోరినా ఊరుకున్నాను.

స్నేహితులు, కవులు, పండితులు, విద్యావంతులు, ప్రపంచ చరిత్రల నెరిగినవారు కొందరు నా విషయం విని, నన్ను వేగిరించారు. నేను వద్దండీ అన్నాను. తిడతారండీ అన్నాను. వారు ఒప్పలేదు. "మీరు వ్రాయకపోతే మరెవరైనా వ్రాస్తారు. ఆ గొప్ప వాళ్ళ కెందుకు పోవాలి" అన్నారు.

మరేమీ ఫరవాలేదు. అయిదు సంవత్సరాలు గడువు ఇస్తాను. ఈ లోగా ఎవరూ ఆ పని చెయ్యరు అని కొంచెం గర్వంగా చెప్పాను. ఆ అయిదూ, మరి అయిదూ గూడా అయినాయి సంవత్సరాలు. ఈ విషయం ఎవరూ తలపెట్టలేదు.

మొన్న ఏప్రిల్ నెలలో నేను స్నేహితులతో మాటలాడుతూ ఉండగా ఈ విషయం వచ్చింది. నేనేదో అరిచాను. విన్నారు. సంతోషించారు. ఇవన్నీ మీరు వ్రాయాలన్నారు కొందరు. నేను ప్రకటిస్తావన్నారు కొందరు. తప్పదన్నారు. ఒట్టుపెట్టారు. నేను గూడా లొంగిపోయాను.

వ్రాశాను, ప్రకటించాను. తిట్లూతిన్నాను. దీవనలూ పొందాను. మహా మేరువు ఎక్కించినవాళ్ళు కొందరున్నారు. పాతాళంలోనికి పంపించిన వాళ్ళు కొందరున్నారు.

## తప్పు చదువులు

కాని ఒక్కమాట చెప్పవలసి ఉంది. చాలామంది ఈ వ్యాసాలన్నీ గేలి చెయ్యడానికీ, వినోదానికి వ్రాసినట్టుగా భావించారు. హాస్యరసం అనుకుంటున్నారు. అదిమాత్రం సరికాదు.

ఇవి చాలా శ్రద్ధతో వ్రాసిన విషయాలు. అందరికీ చదువడానికి, సర్దాగా ఉండడానికి ఇలాగ వ్రాశాను గాని మరేమీకాదు. బూతు మీద మోహం నాకులేదు విషయంమీద విశ్వాసమే నన్ను ఈ వ్రాతలకు పురికొల్పింది. ఆ సంగతిమాత్రం పాఠకులంతా మనసులో ఉంచుకోవాలి.

## తేలిక వ్రాత కాదు :

తేలికబుద్ధితో వ్రాసినదికాదు అని చెప్పడానికి ఎక్కువ అక్కర లేదు. నేను ఈ విషయములను గురించి చూడవలసి వచ్చినవీ, చూచినవీ మనవి చేస్తాను.

అనేక వేల సంవత్సరాలక్రింద అత్యంత నాగరికతను పొందిన రాజ్యాలుండేవి. అవి నశించిపోయాయి. వాటి నన్నిటినీ తవ్వితీసి బయట పెడుతూ ఉన్నారు. వాటివాటి పూర్వచరిత్రలవి విర్మిస్తున్నారు. అలాంటివి ఈజిపు, ఫినిషియా, బాబిలోనియా, క్రీటు, అక్కాడియా, కొంత వరకు గ్రీసు, రోము భారతవర్షము, వీటి పురాతన వ్యవస్థలను గురించి చాలవరకు చూచాను. శ్రద్ధతో పఠించాను. అదేపనిగా, సమన్వయించడానికి చూచాను.

## ప్రశ్నలు :

చదువుతూఉంటే పుట్టిన ప్రశ్నలకు మితిలేదు. వాటిలో మన దేశానికి సంబంధించినవి అనేకం ఉన్నాయి. మన ఆచారాలకు సంబంధించినవి ఎన్నో ఉన్నాయి. మనం వాడుకచేసే వస్తువులకి సంబంధించినవి అనేకం ఉన్నాయి.

భారతవర్షం ఏది ? దాని కా పేరు ఎందుకు వచ్చింది? ఇది ఎంతవరకు ఎరువు తెచ్చుకుంది ? ఎంత ఇతర దేశాల కిచ్చింది ?

అది ఈ ఇండియాయేనా ? కాదా ?

అయితే పారియాత్ర పర్వతాల్లాంటివి కొన్ని ఇక్కడ లేవేమి ?

వివాహమూ, సమర్త, చావూ ఇలాంటి సమయాలలో మన ఆచారాలు ఎందుకు ? పై దేశాలతో సంబంధం ఉందా ?

ఈ వారాలపేర్లు ఈ వరుసలోనే ఎందుకున్నాయి. అన్ని దేశాలలోను ? ఈ వరసకి కారణం ఏమిటి ?

మన అక్షరాలు ఈ రూపంగా ఎలాగ వచ్చాయి ? వాటికి లిపి లేఖన మొదలైన పేర్లు ఎందుకు వచ్చాయి ?

ఇలాగ వందలూ వేలూ ఉన్నాయి. మనం మనకున్న నాలుగు పుస్తకాలే ప్రపంచం అనుకుంటాం, వాటిని తప్పి మన బుద్ధులు వెళ్ళవు. ఆ పుస్తకాలయినా సంపూర్ణంగా నమ్మించలేవు.

చూడండి. హిందువుల కందరికి తెలుసునుకదా దశావతారాలు. దశావతారాలు తెలియవంటే నవ్వుతారు. కాని గుండెమీద చెయ్యివేసి గట్టిగా చెప్పండి పది అవతారాలున్నూ, ఎనిమిదో అవతారం దగ్గరికి వచ్చేసరికి నెట్టుతుంది.

కృష్ణావతారమా ?

బలరామావతారమా ?

రెండూ అవతారాలేనా ?

రెండెందుకు ఒక్క సమయంలోనే ఒక శక్తికో ఉంటాయి? అని ప్రశ్నలు వస్తాయి.

ఎందుకు ఈ ద్వంద్వ ప్రభుత్వం ? మన పుస్తకాలు ఏమీచెప్పవు. పండితులూ, ఆచార్యులూ ఊహలు అల్లుతారు– ఏదో సమాధానం చెప్పక తప్పదని. ఏమి లాభం ; నిజం తెలియాలి.

బలరాముడికి నీలిరంగు వస్త్రం ఏమిటి ? ఆ నాగలి ఆయుధం ఏమిటి ? ఆ తాటిచెట్టు జెండా ఏమిటి? ఆ కల్లు తాగే అలవాటు ఎందుకు? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పవద్దా ?

ఉన్నాయి ఇలాంటివి చాలమట్టుకు. వాటిలో ఒక ప్రశ్నకు ఇంత గ్రంథం అయింది. ఇదిగూడా పూర్తిగా కాలేదు. ఇంకా ఉంది. అయినా ఏదో అయింది అని సంతోషిస్తాను.

## ప్ర జ ల ఆ ద ర ణ :

ప్రజామిత్ర పత్రికలో వారం వారం పడిన ఈ వ్యాసాలకు ఆంధ్ర పాఠకులు చూపించిన ఆదరం అపారం. అందుకుగా వారి కందరికీ నా కృతజ్ఞతాపూర్వక వందనాలు. వారే ఈవ్యాసాలన్నీ ఒక పుస్తకంగా అచ్చు వెయ్యమని కోరారు, చిన్నవారూ కోరారు, మహా విద్వాంసులూ కోరారు, కొంతెక్రొత్త అనుకున్నవారూ కోరారు. గొప్ప విషయం అనుకున్నవాళ్ళూ కోరారు. కొన్ని వేల పుస్తకాలకి ఆర్డర్లు వచ్చాయి. వ్యాసాలు ఈ రూపాన్ని బయట పడుతున్నాయి. దీనికి నాకు సాయం చేసినవాళ్ళు శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు, బి.యన్.కె. ప్రెస్సువారూ అని నేను

చెప్పకుండానే పాఠకులు గ్రహించుకోగలరు. నే నిక్కడ చెప్పవలసిం దేమిటంటే, వారికి నా వందనాలని. దీనియందు ఆంధ్రలోకం చూపించిన ఆదరంతో తక్కినవ్యాసాలు గూడా అచ్చుముఖం చూడవచ్చునుగదా అని ఒక ఆశ లేకపోలేదు

## ప్రతి విమర్శనలు :

ఇకను ఒక్కమాట ప్రతి విమర్శనల గురించి. నా వ్యాసాల మీద ప్రతి విమర్శనలు కొన్ని కురిశాయి ఒక జడివానలా. ఇవి (అంటే వాటిలో) తెలివితేటలున్న ప్రశ్నలు నాకు కొత్తవికావు; వన్ని నేను ఇంతకు పూర్వం అనుగుకున్నవే.

కాని ఒక్క భేదం ఉంది. ఈ ప్రతి విమర్శనలో తిట్లుమాత్రం ప్రకోపించి ఉన్నాయి. విషయాన్ని గాని, సమాధానాన్నిగాని తిడితే తప్పులేదు. నన్ను తిట్టడం ఎందుకో తెలియదు. ఆవేశం. పాపం ; మనసు ఒప్పుకోదు నేను చెప్పిన మాటలు విని ఊరుకోడానికి.

వాద ప్రతివాదాలలో అలా ఉంటే పనికిరాదు. దురభిమానం వదులుకోవాలి. అభిమానం కొద్దీ "నువ్వు చెప్పిందంతా అసత్యం? నీ కేమీ చదువురాదు ; నువ్వువట్టి పోకిరీవాడివి !" అంటే ఏమి లాభము ?

ఇలాంటి వ్యాసాలు ఒక్క భారత వర్షానికి సంబంధించినవి కావు. సర్వమానవ ప్రపంచానికీ సంబంధించినవి. వీటిలో ఉన్న సత్యాసత్యాలు గ్రహించడానికి గాని, నిరసించడానికిగాని బుద్ధి ప్రపంచ మంతటా వరుగులెత్తగలగాలి. వేల సంవత్సరాలు వెనకకి చూడగలిగి ఉండాలి. పరిస్థితులను పరిశీలించగలిగి ఉండాలి.

## ఒక్క వాగ్దానం:

ఈ వ్యాసాలలో నేను వ్రాసిన విషయాలు చాలా ఉన్నాయి. ముఖ్యమైనవాటికి ఆధారాలు చూపుతున్నాను. అలా చూపించనివి ఇంకా కొన్ని ఉండవచ్చును.

వ్రాయడంలో కొంత నా తెలివి తేటలో తెలివితక్కువో చూపించి ఉంటాను. కాని విషయంలో మాత్రం అలా తెలివి తేటలు చూపడానికి ప్రయత్నం చెయ్యలేదు. లేని సంగతులను కల్పించలేదు. ఉన్నవాటిని వంకరలు తిప్పలేదు. ప్రత్యేక కృషి చేసిన మహానుభావులు వ్రాసిన విషయాలే నేను ఎత్తిచూపించాను. వాళ్ళు ఆ యా దేశాలలో ఉన్న ఆచారాలనీ అర్థాలనీ వ్రాశారు. నేను వాటి పక్కను పెట్టాను. మన దేశంలోని ఆచారాలనీ అర్థాలనీ. అంతేగాని కవిసమయాలూ, కల్పనలూ వాడుక చేయలేదు. యథార్థంగా నేను చదివి సంగ్రహించినదే వ్రాశాను. అందుచేత నేను వ్రాసినవాటిలో ఏదీ కల్పనకాదు. ఇదే నా వాగ్దానము. కాబట్టి సంశయబుద్ధి పాఠకమహాశయులకు ఆ సంతగూడా ఉండనక్కరలేదు.

## దేశాల సంపర్కం:

తక్కువ దేశాలలో అలాగుండవచ్చును. అంతమాత్రంచేత మనదీ అలాంటిదే అని ఎందుకనాలి అని అంటారు గాబోలు!

దేశాలు ఆచారాలూ అంత పరస్పరంగా ఉండడం కష్టం. ఒకదానిని అంటకుండా ఇంకొకటి ప్రక్కనే ఉండాలంటే ప్రపంచంలో జరగని పని. ఒక వస్తువులో ఉన్న గుణగణాలు దాని ప్రక్కనున్న వస్తువుల వల్ల ఇంతో అంతో మార్పు చెందకుండా ఉండలేవు. అది ప్రకృతి తత్వం.

అలాంటిది మనుష్యులు ఒకరిని చూచి ఊరుకుంటారా? వీరి వల్ల వారూ, వారివల్ల వీరూ మార్పు చెందరా? వారిది కొంత వీరూ వీరిది కొంత వారూ తీసుకోరా?

దొరల పంట్లాంలు మనం తీసుకోలేదా? మన వారు, (రసం మొలఘుతన్నీ) దొరలు తీసుకోలేదా? అలా సంపర్కం ఉంటుంది.

ఇంకా ఒక ప్రశ్న ఉంది. మనదగ్గరనుంచి బాబిలోనియ, ఈజిప్టు మొదలైన దేశాలు ఎరువు తీసికోని పోయాయా? లేక హిందువులే వాళ్ళ దగ్గరనుంచి తెచ్చుకున్నారా అన్న ప్రశ్న.

దీని గురించి నాకూ ఒక అభిప్రాయం ఉంది. సకారణం. కాబట్టే సత్యమే అనుకుంటాను. పండితులూ విద్యాధికులూ నా కారణాలని కొట్టి వేయలేకపోయారు? ఒప్పుకోడానికి ఇష్టం లేకపోయినా, కాదనడానికి కారణం చూపలేకపోయారు. ఆ సంగతులన్నీ "భారతవర్షంఏది"అన్నవ్యాసాలలో వ్రాస్తాను మీ అందరి అనుగ్రహం ఉంటే.

ఏది ఎలాగ అయినా, దేశాలకీ దేశాలకీ సంబంధాలు ఎప్పుడూ ఉంటాయి. ఉన్నాయి. అంతేగాని మన దేశం"నన్నుముట్టుకోకు నా మాల కాకి" అన్నట్టు ఉండిపోలేదు.

దీనికితోడు మరొక్కమాట, మానవ నాగరికత ఏ దేశంలో నయినా ఏ ఖండంలోనయినా కొన్ని మెట్లమీదుగానే వికాసాన్ని పొందుతూ వస్తుంది. ఆ మెట్ల వరసని తప్పించడం కష్టం. ఆలస్యంగానో వేగంగానో, ఎప్పుడో ఒకప్పుడు ఆ మెట్టుమీద నడక తప్పదు. ఈ మాటగూడ మనసులో ఉంచుకోవాలని ప్రార్థిస్తున్నాను.

మెద్రాసు
1936

తాపీ ధర్మారావు

# దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు?

---

## కోవెలంటే ఏమిటి?

కోవెలంటే ఉబలాటం కొంతమందికుంది. "ఉబలాటం అంటే ఉబలాటమే....తెలిసీకాదు, తెలియకా కాదు" అని అన్నానా, తెంపరి వాడననో, తెలివితక్కువవాడననో తెగ తిడతారు. నాస్తికుడనని వెలివేస్తారు. పెట్టరాని పేర్లు పెట్టి పిచ్చివాడిని చేసేస్తారు.

అయ్యా. అలాకాదనండి, నేను చెప్పేమాట వినండి.

## తెలియదంటారా?

కోవెలంటే ఏమిటో మీకు తెలియదంటారా? అలా అయితే ఈ ఆవేశం ఎందుకు, ఈ సహస్రనామార్చన లెందుకు, ఈ సాష్టాంగాలెందుకు, ఈ చెంపలు వాయించుకోడాలెందుకు, ఈ మొక్కుబడు లెందుకు? తెలుసుకోకుండానే ఇవన్నీ చేస్తున్నారంటే, మీకే ఎలాగుంటుందో ఆలోచించుకోండి. అంతా మూర్ఖత్వం, గొర్రెదాటుగాథా కావలసివస్తుంది.

అజ్ఞానానికి పట్టాభిషేకం చేయవలసివస్తుంది. అది అట్టే సంతోషించవలసిన పనికాదు. అలా అయితే ఒప్పుకొనేవాడెవరు? అంచేత ఏదో కొంత తెలిసేఉండాలి అంటాము.

## తెలుసునంటారా?

కోవెల అంటే ఏమిటో తెలుసునంటారా?... అనాలి. జంకుతూనో జరుస్తూనో తెలుసును అనాలి. తప్పదు.

అనేటప్పటి కారంభిస్తుంది. అంపవాన, ప్రశ్నమీద ప్రశ్న వడగెత్తుకుంటూవస్తుంది. ఆ అడగటానికి మరిఅంతు ఉన్నట్టే కనబడదు. చూడలేక కళ్ళు చీకిదాట్లు పడతాయి. వినలేక చెవులు దిమ్మలు పడతాయి.

కోవెల అంటే అర్థం ఏమిటి?

అది ఇలాగే కట్టడమెందుకు?

వాటిమీదనూ, లోపలనూ ఆ బూతుబొమ్మ లెందుకుండాలి?

ఈ వెంట్రుకల మ్రొక్కుబడు లేమిటి?

ఆ దేవత విగ్రహం అలా ఎందుకుంది?

ఈ దేవదాసీ లెందుకు?

ఆ కామదహనా లేమిటి?

ఈ పూజారుల ఆచారా లేమిటి?

వీళ్ళకున్న పేర్లెందుకు వచ్చాయి?

ఆ సహస్రనామాల అర్థాలు తెలుసునా?

ఇలాగ ముక్క ముక్కకీ ముసురుకొని వస్తాయి ప్రశ్నలు.

# 3

## చెప్పగలమా జవాబులు?

ఆ ప్రశ్నల కన్నిటికీ కాకపోయినా, కొన్నిటికయినా జవాబు చెప్పగలరా అంటే గుడ్లు మిటకరించవలసిందే. ఆమాట ఒప్పుకోవడానికి కష్టంగా వుంటుంది గాని, నిజం అంతే అవుతుంది. గుడ్లు మిటకరిస్తాం. గొడ్డూ గోదాతోనూ, పిల్లా పిచ్చుకాతోనూ కూలీనాలీతోనూ కాలాన్ని వెళ్ళబుస్తూవుంటాం మనం. అలాంటి మనం మిటకరిస్తే మించి పోయిందేమీ లేదు మతం పెద్దలు, కోవెం పెద్దలు, ఆచార్యుల పెద్దలు, చదువు పెద్దలు శిల్ప పెద్దలు ఉన్నారే, వాళ్ళు మిటకరిస్తేనే తంటా. అది ఇలావుండాలి, ఇది అలా వుండకూడదు అని అనడానికి, అధికారం ఉన్నవాళ్లు నీళ్లనము ల్తేనే, తంటా. ఈ దోషం చేశావు కాబట్టి ఈ శాంతి చేస్తేనేగాని చంపేస్తాం, మింగేస్తాం అని శాస్త్రిలు వల్లించేవాళ్ళు పెప్పెప్పె అంటేనే తంటా. వాళ్ళు ఏమయినా చెప్పుతారా చూడండి.

ఊరకే అడిగినపాటున జవాబిమ్మనకండి. అది అన్యాయం అవుతుంది. తెలివి అంతా 'రెడీమేడు'గా తలకాయలోనే ఉంచుకుంటారా ఏమిటి? ఆ పండితులకీ, ఆ ఆచార్యులకీ కావలసినంత అవకాశం ఇవ్వండి. గ్రంథాలు తిరగవెయ్యమనండి. కావలిస్తే వాళ్ళకి కావలసిన పుస్తకాలు. వాళ్ల దగ్గర లేకపోతే సంపాదించి ఇవ్వండి. అన్ని సదుపాయాలూ చెయ్యండి. అంతా అయిన తరువాత 'అయ్యా, ఏమంటారండీ' అని అడగండి ఏదో తేల్తుంది.

## అల్లాటప్పా సమాధానాలు :

అంతేగాని, అడిగారుకదా అని 'అల్లాటప్పా' జవాబులు చెప్పితే మాత్రం లాభంలేదు. అలా చేయడానికి ప్రయత్నిస్తే ప్రశ్నలవర్షం ప్రకోపించిపోతుంది.

తనకు నమ్మకం వుండాలి. ఇతరులను నమ్మించాలి.అలాగయితేనే సమాధానం అవుతుంది. 'ఆచార్య ఉవాచ' అని చెప్పితే అభాసం అవుతుంది. అన్నవాడికీ, ఆచార్యుడికీ ఇద్దరికీ తంటావస్తుంది. చదురెక్కి సమాధానం అడిగేటప్పుడు సాహసం పనికిరాదు. దాన్ని సాగనియ్యరు తెలిసినవాళ్ళు. కుక్క జవాబూ, నక్క జవాబూ పనికిరాదు. సరసు లంగీకరించాలి. చాలినంత బలం వుండాలి.

## ఒక కుక్క జవాబు :

కుక్క జవాబు అంటేనా ? చూడండి.బూతుబొమ్మ లెందుకుంటాయి అని అడిగితే మా ఆచార్యులవారు అన్నారు :

"ఏముందండి ! దైవభక్తికి మనస్సు ప్రధానం అయింది. అది నిశ్చలంగా వుండడం ముఖ్యం. కుండలో పెట్టిన దీపంలాగ ఇటూ అటూ చలించ కూడదన్నారు పెద్దలు. ఆ నిశ్చలత్వం వుందో లేదో పరీక్ష చేయడానికే ఈ బొమ్మలుపెట్టారు. ఈ బొమ్మల మీదికిగాని దృష్టి వెళ్ళిందా, పరీక్షలో 'ఫేల్' అయిపోయాడన్నమాట. అలా చెదరకుండా దేవుడిమీదనే నిలిచిందా మనస్సు వాడు ప్యాసయాడన్నమాట. అది ఒక పరీక్ష లాంటిదండి" అని 'ఉవాచించారు' ఆచార్యులవారు.

ఇది నిలిచే సమాధానం కాదు. దూదికన్నా తేలిక. అసలు ఆ పరీక్ష ఎందుకు ? మరి వేటిమీదకయినా పోకూడదా మనసు ? దేవుడి కిరీటం మీదనున్న పనితనం చూస్తూవుంటే పరీక్ష ప్యాసవుతాడా ? పరీక్ష అయితే పంచ మహాపాతకాల బొమ్మలు ఉంచరేమి ? .... ఉంచరు. కారణం వేరు కాబట్టి, మనవి చేస్తాను.

5

## సక్కజవాబు :

కోవెల అంటే ఏమిటండి అని అడిగితే "కోవెల అన్నది ఒక మాట. చేతికి చెయ్యి అన్నట్టే. కాలుకి కాలు అన్నట్టే. కోవెలకి కోవెల అని అన్నారు. శబ్దరత్నాకరంలో గూడా వ్యుత్పత్తి యివ్వలేదు ఏమిన్ని. ఉత్తనే 'గుడి' అని అర్థం వ్రాసి ప్రమాణం ఇచ్చారు" అని సమాధానం చెప్పుతారు. ఇది ఆ ప్రశ్నకి సక్కజవాబు.

## మంచి జవాబు ఏమిటి?

ఏమిటలా కొట్టిపారేస్తున్నా రంటారా ! చిత్తం ! ఆ శబ్దరత్నాకరంలోనే 'కోయిల' అన్న శబ్దంకూడా చూడండి కొంచెం. దానికీ ఉంది ఇదే అర్థం. దానికీ వ్యుత్పత్తి ఇవ్వలేదు. దానికి ఇచ్చారు ప్రమాణం. మరేమి టంటారు ? అదీ ఉంది, ఇదీ వుంది. అంటే రెండూ కాలు అన్నలాంటి మాటలే అవుతాయి. శబ్దరత్నాకరంలో ఆ రెండు మాటలూ రూపాంతరాలని అయినా అనలేదు. ఒకమాటనుంచే ఇంకొకమాట పుట్టిందని కనబడుతూనే వుంది. ఇలా చూచామంటే మన నిఘంటుల పస బయటపడుతుంది. కాబట్టి వీటి నాధారం చేసుకోవడం ప్రమాదం.

అరవభాషలోనూ 'కోయిల్' అని గుడికి మాటవుంది. కో అంటే దేవుడు, సంస్కృతంలో 'గో' అంటారు. ఇల్ అంటే ఇల్లు. కోయిల్ అంటే దేవుడి ఇల్లు. అదే దేవ ఆలయం అన్నారు సంస్కృతంలో. బెత్ ఎల్ అన్నారు హిబ్రూలో (ఎల్-దేవుడు, బెత్-ఇల్లు). అభిప్రాయం అంతటా ఒకటే. దేవుడి ఇల్లు అనే. అంచేతనే మనమాట తెలుగులో కోయిల అని ఉండాలి. అలాగే వుండేదికూడాను. కోవెల అనడం మార్పు: అంటే వికృతే అన్నమాట. ఈ వికృతే స్వచ్ఛం అనుకుంటారు కొందరు.

కోవెల అని ఒత్తిపలుకుతూ, కోయిల అన్నవాళ్లని కొంచెం విరసించి కూడా చూస్తారు. పసుల కాపరివాడు స్వచ్ఛంగా మాటలాడాలంటే ఎగిరి పోయింది అనడానికి వెగిరిపోయింది అంటాడు చూడండి. అలాగే కోయిల కోయెల అనడానికి కోవెల అన్నారు స్వచ్ఛం అనుకుంటూ. ఇప్పుడు మొదటివాళ్ళనే వెక్కిరిస్తారు. కాలం మహిమకదా ; ఆ మాటే తెలుగు లోకి వచ్చింది.

## గౌరి అన్న మాట :

కోయిల అన్న మాటకి ఉత్పత్తి మరచిపోయాం. 'కో' అన్న మాట వదలుకున్నాం. కో అన్న మాటతో కొంపలు మునిగిపోయాయి. సంస్కృతం 'గో' ఉంచి కాని వాళ్లుగూడా దాని అర్థాన్ని మరచిపోయారు మరచిపోయిన దానిని మాటలతో పూరించడానికి చూచారు. ఈ 'కో'నుంచే కాః(కాహ్) అని వచ్చింది. అదే దేవుడు. అదే కొండ, హిందూ కాః లేక హిందూకుష్‌లో ఆ రూపం కనిపిస్తుంది. కాః! స్త్రీలింగం కాహరి. కుహరి లేక కామరీ. కుమరీ అన్న మాటలు వచ్చాయి. వీటి అర్థం స్త్రీ దేవత. ఆడది, కొండకూతురు (లేక భార్య) కన్యాకాహరీ. కన్యా కుమరి అన్నపేరు వ్యుత్పత్తి చూడండి. కన్యా, కుమారీ అనే మన అర్థాలతో అది సరిపడదు. దాని అర్థం కన్యాపార్వతి అని. ఆ కాహరీ కుమరీ అన్నమాటే గాహరీ. గుమరి గౌరీ అని మారింది. ఆ గౌరియే పార్వతి: కొండకు స్త్రీ (లేక కూతురు) అని అర్థం. అంతేగాని రంగును పట్టి వచ్చినమాట కాదు. సంస్కృతంలో మనకిచ్చిన వ్యుత్పత్తి అంతా మసిపూసి మారేడుకాయ చేయడమే కాని వేరుకాదు. కో, గో, అనే మాటలు ఎలాగ దేవుడు, దేవతుల్యుడు అయి తరువాత మంచిమనిషిఅన్న అర్థం ఇచ్చాయో, అలాగే కుమరి శబ్దానికి రానురాను ఆడది అన్న అర్థం

వచ్చింది. గౌరీ అంటే 8 సంవత్సరాల పిల్ల అని అర్థం సంస్కృతంలో ఉంది.

"అష్టవర్షాభవేత్ గౌరీ"

(పాఠాంతర మైనప్పటికి అదే అర్థం) ఈ గౌరీ అన్నమాట 'కుమరి' అన్న మాటమే కాని వేరే మాటకాదు. లేనిపోని వ్యుత్పత్తులతో పనిలేదు. నిఘంటువులు ఈ విషయాల్లో ప్రమాణాలు కావు.

## కొహినూర్ వజ్రము:

నాదర్ షా మొగల్ సామ్రాజ్యం దోచినప్పుడు వానికి ఒక పెద్ద వజ్రం-మంచిజాతిది-కనిపించింది. నాదర్ షా మెచ్చుకొని, ఏమిటిది అని అడిగాడు. ఉద్యోగస్థులు "ఇది కొల్లూరు వజ్రమండి" అన్నారు. నాదర్షా గారు "ఎ కొయిలూర్" నై; కొహినూర్ హై" అన్నారట. (ఇది కొయిలూరు వజ్రం కాదు, కొహినూరు అన్నారట) నూర్ అంటే కాంతి,కొహి అంటే కొండ; కొహినూర్ అంటే "కాంతికొండ" అని అర్థం. ఇప్పటికీ ఆ వజ్రా కి అదే పేరుంది. ఆ వజ్రమే ఇప్పుడు బ్రిటిషు రాణి కిరీటంలో వున్న పెద్ద వజ్రము.

## నిఘంటుకర్తలు:

మాటల కర్థం మరచిపోయారంటే, ఆచారాల కర్థం అసలే ఎగిరిపోయిందన్నమాట.మరచిపోయారంటే ఎవరు? ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఉన్న మనం మరచిపోతే చింతలేదు. హిందూదేశంలో సంస్కృతభాషలో అది నిఘంటువులూ డిక్షనరీలూ,శాస్త్రాలూ వ్రాసిన మహానుభావులున్నారే వారే మరచిపోయారని మనవి చేస్తాను. మరచిపోయినవారు మరచిపోయి

పట్టు ఊరుకున్నా కొంత నయంగా ఉండేది. అలా వారు ఊరుకోలేదు. ఎలాగ ఊరుకుంటారు పాపం ! ఊరుకుంటే ఆ మాటకి అర్థం వీరికితెలిసింది కాదని లోకులంటారు. మహత్తుకి భంగం వస్తుంది. కాబట్టి ఏదో ఒక అర్థం చెప్పాలి. అలా చెబితే చాలు. ఆ ! మనవారికి అన్నీ వచ్చును కాని లోకం అంతా మోగుతుంది. చెప్పినది సరిగా వుందా, లేదా అన్న గొడవ ఎవరు పెట్టుకుంటారు ? అలా పెట్టుకోడానికి వరుకు ఎవరి దగ్గరైనా ఉంటేకదా ! కాబట్టి ఏదో ఒక అర్థం చెప్పి, ఖాళీలేకుండా చేయడమే మన నిఘంటు కర్తలు చూచుకున్నారు. గ్రంథం సంపూర్ణంగా ఉండడమే చూచారు గాని అందులో వుందింది చెత్తో, చెదారమో చూచారుకారు.

మనవారు పురాణాల కర్థం చెపుతుంటారు చూడండి ! అందులో ఒక పద్యానికో ఒక మాటకో అర్థం తెలీయ దనుకోండి. అప్పుడు పురాణం పండితుడు రవ్వంతైనా తొణుకుతాడా, బెణుకుతాడా ? అంతా తెలిసిపోయినట్లుగానే రాగాలు తీసుకుంటూ ఏదో, వెర్రో మొర్రో,అర్థం చెప్పి లోకుల్ని మెప్పిస్తాడు! అలాగే నిఘంటువులు వ్రాసినవారుకూడాను. వారి కాలానికప్పుడే అర్థాలు మరచిపోయారు. ఆ మాటలూ, ఆచారాలూ మాత్రం నిలిచి వున్నాయి. నిఘంటువులు, శాస్త్రాలు వ్రాయాలి. ఏమి చెయ్యడం ? ఏమిటో వీటి సంగతి నాకు తెలిసింది కాదు అంటే వ్రాసిన వాడి 'అబోరు' నిలుస్తుందా ? ఏమీ తెలియని ఈంతగూడా, ఎబ్బే వీడి కేమీ రాదురా' అనేస్తాడు. ఇంకా ఏమైనా మర్యాద దక్కుతుందా ? తెలిసి చెప్పిన సంగతులలోనైనా ప్రజలకు తగినంత విశ్వాసం కలుగుతుందా ? కాబట్టి దిక్కులు చూడకుండా టక్కున చెప్పవలసిందే తనకు తెలియకపోయినా ? అలాంటి అవస్థలో పడిపోయారు పాపం మన నిఘంటు కర్తలంతాను. వారినేమీ అనకూడదు. ఆ అవస్థలో మనముంటే మనమూ ఆ పనే చేసి ఉందుమేమో ! నాకు తెలియను. అని అనడం "నామోషీ" చిన్నతనం అనుకుంటాము కదా !

## ఆచారాలు నిలుస్తాయి, అర్థాలు పోతాయి :

ఇలాగ వ్రాయడంచేత మన నిఘంటువులను ప్రమాణాలుగా చెయ్యాలంటే కొంచెం చిక్కు కలుగుతుంది. ఆచారాల సంగతికూడా అలాగే అయింది. మొదట ఏదో ఒక ఉద్దేశంతో ఒక ఆచారం ప్రచారం లోనికి వస్తుంది. ఆ ఆచారం సాగుతూ ఉంటుంది. అర్థం మాత్రం మరచిపోతాము. అసలు ఉండిన అభిప్రాయం మరుపులో పడిపోతుంది. తరువాత ఎప్పుడో ఒకడు ఆ ఆచారాన్ని గురించి వ్రాయవలసివస్తుంది. అప్పుడతడు నేలవిడిచి సాముచెయ్యవలసి వస్తుందిగదా! మరేమి చేస్తాడు?

## ర వి క వ్యు త్ప త్తి :

రానిదాని కర్థం రప్పిస్తాడు. రవిక అన్న మాటకి వ్యుత్పత్తిచెప్పటానికి పూనుకొని 'ర' అంటే రాత్రులందు, 'వి' అంటే విభుడిచేత, 'క' అంటే కట్టు విప్పబడేది కాబట్టి "రవిక" అన్నారు అని నిర్ధారించి చెప్తాడు. ఆహా! ఏమి తెలివిరా అని ఆనందిస్తారు విన్నవారంతా.... ఏమి చెయ్యమంటారు! కాబట్టి ఇలాంటి అర్థాలనిపట్టుకొని మనం జ్ఞానం సాధించాలంటే చాలా కష్టం అవుతుంది. పుణ్యానికి, పురుషార్థానికి రెంటికీ చెపుతాం.

## వా స్త వం లో కి ది గా లి :

వారిచ్చిన అర్థాలని పట్టి చూస్తే ప్రపంచం అంతా మారుతూ మారుతూవచ్చి ఒకనాడు స్తంభించిపోయినట్టు కనబడుతుంది. స్తంభించి పోవడం సజీవంగా ఉన్న ప్రపంచానికి ఎప్పుడూ లేదు. స్తంభించిందంటే

తెలుగులో వచ్చిందన్నమాట. సజీవం కాదన్నమాట. ప్రపంచం ఎందుకలా అవుతుంది? కాబట్టి ఆ వ్రాతలూ, ఆ అర్థాలూ పనికిరావంటాను. వాస్తవంలోకి దిగాలి. మూఢవిశ్వాసాలు మొదలంట కొయ్యాలి. దురభిమానాలు దూరంగా తోలాలి. నిజం తెలుసుకోవాలి—అది మనకు నచ్చినా సరే నచ్చకపోయినా సరే అలాంటి ఆదరణ చూపుతారనే ఈ విషయాలు వ్రాస్తున్నాను.

## దేవుడన్న అభిప్రాయం:

మానవజాతి ఇప్పుడున్నట్టే ఎల్లప్పుడూ ఉండేది అని మనం అనుకోకూడదు. మన తాతలు ఉండినట్టు మనం లేము. వారి తాత లుండినట్టు వారు ఉండలేదు. ఈ మాట మాత్రం మరచిపోకూడదు. మనకు ఇప్పుడు అసత్యంగా కనిపించే సంగతులు అన్ని కాలాలలోనూ అసత్యంగా ఉండేవని అనుకోకూడదు. ఇప్పుడు పాపం అని అనుకుంటున్న పనులు అన్ని కాలాలలోనూ పాపంగానే ఉండేవని తలచకూడదు. నీతి సూత్రాలు, స్త్రీ పురుషుల సంబంధ సూత్రాలు అన్నీ అనేకమైన మార్పులను పొందుకుంటూ వచ్చాయి. ఇంకా మార్పులు చెందుతూ ఉన్నాయి. అలాగే దేవుడు అన్న అభిప్రాయంగూడా మారుకుంటూనే వచ్చింది. చాలా విపరీతంగా మారింది. ఈ మాటలు మాత్రం మనసులో ఉంచవలసియ్యుంది.

## లేకపోతే కలిగే చేటు:

మారుతూ ఉండేవి అన్న సంగతి మరచిపోతే మహా ఘోరమైన ప్రమాదం కలుగుతుంది. అయిదుగురిని పెండ్లాడిన ద్రౌపది అవాచ్యురాలవుతుంది. ప్రతివ్రతలని పేరుపొందినవారు కొందరు వట్టి పాపాత్ము

రాళ్ళుగా కనబడతారు. వంశకర్తలు, ధృతరాష్ట్రుడు లాంటివారు. రంకు బిడ్డ లవుతారు. మహాఋషులు కొందరు అంటరానివా రవుతారు. అంచేత ఇప్పటి అభిప్రాయాలతో అప్పటి సంగతులు విమర్శించడం కూడదు. ఈ దృష్టితో పాతసంగతులను చూడరాదు. లోకం చాలా చిత్రంగా మారుతూ వచ్చింది. తల్లి కొడుకును పెళ్ళి చేసుకొని ధన్యవాదాలు పొందుతూ ఉండే రోజులున్నాయి. చెల్లెలిని పెళ్ళిచేసుకొని చక్రవర్తులుగా ఉండే రోజులున్నాయి. భార్యను ఎరువు ఇచ్చే రోజులున్నాయి. ఎవడినో ఒకడిని తీసుకొనివచ్చి, భార్యను వాడి కప్పజెప్పి, ఆ రూపంగా సంతాన లాభం పొందే రోజులున్నాయి. కూతురిని పెళ్ళాడే రోజులు, వదినెలనీ పెళ్ళిచేసుకొనే రోజులు ఉన్నాయి. (*) ఆ రోజులలో ఆ పనులు దోషాలుకావు. న్యాయసమ్మతాలు, శాస్త్రసమ్మతాలు. ఆ రోజులలోని చిన్నెలు కొన్ని ఇప్పటికీ మన ఆచారాలలోనూ, కొన్ని పండుగలలోనూ కనబడుతూ ఉంటాయి. పరీక్షించి చూడాలిగాని, ఆ సంగతులన్నీ ఈవేళ మనకున్న సూత్రాలతో విమర్శిస్తే ప్రయోజనం ఉండదు. వాళ్ళంతా "లంజకొడుకులు". "తల్లికి మొగుళ్ళు". "సంకరజాతులు" కావలసివస్తుంది. ఆ రోజులలో ఎవడినయినా "లంజకొడకా" అంటే "కానివాడెవడురా ఏమి జాతివాడా" అని అనుకుంటారు రోజులు అలాగుండేవి. వారంతా మన పూర్వులే; వారి సంతతివారమే మనమంతా. ఆ ఆచారాలలో నుంచే మన ఆచారాలు పెరిగాయి. ఇదంతా చూస్తే మన

(*) ఇటువంటి వివాహాలను గురించి నేను "పెళ్ళి-దాని పుట్టు పూర్వోత్తరాలు" అన్న గ్రంథంలో వివరంగా వ్రాశాను; దానిలో చూడవచ్చును. "రాముడికి సీత ఏమవుతుంది?" అన్న ప్రశ్నకు జవాబుగా "భారతి" మొదటి సంవత్సరం సంచికలలో "కొన్నకర్ర ప్రశ్న" అన్న పేరుతో కొంత వ్రాశాను. అదికూడా ఈ సందర్భములో చూడవచ్చును.

మూలపురుషులు, వంశకర్తలు; మహావీరులు ఇలాంటి వాళ్లంతా, తేట తెలుగులో చెప్పాలంటే, కొంచెం తెల్లబోవలసివస్తుంది. అయితేమాత్రం మానుకున్నామా? వారంతా మహానుభావు లన్నాం. ఎంతవింత కథలు కల్పించాం. దేవత్వాన్ని తెచ్చిపెట్టాం. నిజాన్ని అబద్ధాలతో నింపివేశాం.

దేవాలయాలనీ. దేవుడ్ని కూడా అలాగేచేశాం.

# దేవాలయాలు శోభనపు గదులు

భారతీయుల తండ్రులు వెధవముండకొడుకులంటే, వినడానికి వెగటుగా ఉంటుంది ఇప్పటి దృష్టిని. ఆ మాట అన్నవాడిని అమాంతంగా చంపివేయాలనిఉంటుంది. కాని అది నిజమేకదా! అలాగే దేవాలయాలన్నీ బూతుకొంపలంటే (ఇప్పటి దృష్టిని) తెగదీసి తన్నాలని బుద్ధిపుడుతుంది. మనవారికే కాదు, ప్రపంచంలో చాలామందికి. ఈ పాడుమాటలు వినకూడదని చెవులు మూసుకుంటారు. ఈ పాపిష్టివ్రాతలు చదవకూడదని ప్రచారం చేస్తారు. వ్రాసినవాడిని 'శాశ్వతనరక వాసం' అన్న శిక్షకు పంపించేస్తారు. వీరికా శక్తిఉంది. నరకం అంటూ ఒక స్థలం ఉంటే, ఏమేమి చెయ్యడానికి వీలుంటే అవంతాచేస్తారు వాడిని పట్టుకొని. అంత కటువుగా ఉంటుంది ఆ మాట.

కాని నిజమే సుమండీ! దేవాలయాలు అన్నీ ఆ రోజులలో సంభోగాలకోసమూ, బూతుపనులకోసమూ నిర్మించినవే! బూతు అంటే ఇప్పుడు మనం చాలా అసహ్యంగా చూస్తూ ఉన్నాముగాని ఆ రోజులలో అది ఒక మహాకార్యం, ఒక ప్రజాసేవ, ఒక మహాభక్తి, ఒక పవిత్ర ఆరాధన, ఘనకార్యము. ఆ రోజులలో దానియందు అసహ్యత లేదు. నీచత లేదు. పాపం లేదు. మీదుమిక్కిలి అందరూ చెయ్యవలసినది. పవిత్రమైనది. గౌరవానికి అర్హమైనది. అది చెయ్యకపోతే పాపం, దేశద్రోహం, కృతఘ్నత, అలా చెయ్యనివారిని నరకానికి పంపించేవారు.

ఆ బూతుపనులు ఎక్కడో చెయ్యడంకాదు. సాక్షాత్తు దేవాలయం లోనే దేవుడి సన్నిధానంలోనే చెయ్యాలి. అందరికీ తెలిసినట్టే చెయ్యాలి- సిగ్గూ, దాపరికమూ ఉండనక్కరలేదు. ఇది అంతా నిజము. ఏమిటీ విప రీతం అనిపిస్తుంది. మన 20 వ శతాబ్దం చెవులకు, వ్రాసిన వాడికి పిచ్చి పట్టిందా చదివేవారు కలగంటున్నారా అన్నట్టు ఉంటుంది.

ఇప్పుడు, ఈ రోజులలోగూడా దేవాలయాలు అలాటి పనులకు ఉప యోగపడవచ్చు. చెప్పరాని అనాచ్యాలు ఎన్నయినా ఈ కోవె లో ఇప్పుడు గూడా జరుతూ ఉండవచ్చు. కోవెలలు ఈ దినాల్లోగూడా అనేక సంధా నాలకు అంకురార్పణ చేయవచ్చు. మిండగాళ్ళకీ, మిండకత్తెలకీ కోవెలలు ఎంతవరకు ఉపయోగిస్తున్నాయో మన కథానికలలో మన పట్టణాలలోనూ తెలుస్తుంది. ఈ సంగతులు ఇప్పుడు జరుగుతున్నా, వీటికి ప్రజల అంగీ కారంగాని, శాస్త్రీయ సమ్మతిగాని లేవు. ఇవన్నీ దొంగపనుల క్రిందకి వస్తాయి.

కాని ఆ రోజులలో అలాకాదు. అది అప్పుడు శాస్త్ర సమ్మతం. స్త్రీలు దేవాలయాలలో బూతుపనులుచేసి ఆ రూపంగా గడించిన డబ్బు దేవా లయాలకే దానంచేసి శాసనాలు వ్రాపేవారు. "నేను కోవెలలోపడుపువృత్తి చేత ఆర్జించిన సొమ్ము దేవుడి దీపారాధనకి దానం చేస్తున్నాను" అనే మోస్తరుగా ఉన్న శాసనాలు (దస్తావేజులు) ఇప్పుడుకొన్ని దొరికాయి. అవిఉన్నాయి. రుజువులు కావలిస్తే.

## పడుచుకొని గడించిన ధనం

లిడియాదేశంలో ట్రాలెప్ అన్న స్థలం దగ్గర చరిత్ర పరిశోధకులు తవ్వించి పురాతన పట్టణాన్ని ఒకదానిని కనుక్కున్నారు. అందులో చలువరాతి స్తంభం ఒకటి దొరికింది. దాని మీద అప్పటి భాషలో ఒక శాసనం చెక్కిఉంది. మహానుభావులు ఫ్రెంచివారు, రాలిన్సన్‌లాంటి

ఇంగ్లీషువారు అప్పటికి ముందే ఆ భాషనిగురించీ, అక్షరాలని గురించీ బాగా నేర్చి ఉన్నారు. ఆ జ్ఞానంతో వారా శాసనాన్ని చదివారు.

ఒక అమ్మాయి 'అరేలియా ఇమిలియా' తన వృత్తినీ, తనవంశపు వృత్తినీ గర్వంతో చెప్పుకొన్నది. ఏమని ? దేవాలయంలో వ్యభిచారమని ఆయమ్మ కోవెలకి తన ధనం దానం చేసింది.

దీనిని రామ్సేగారు 'అన్ ఎడిటెడ్ ఇన్స్క్రిప్షన్సు ఆఫ్ ఏసియా మైనర్' అన్న వ్యాసంలో వ్రాశారు.

బాబిలోనియా దేవత మిలితా దేవికి ఇలాగే శాసనాలు వ్రాసి ఇచ్చిన వారున్నారు.

ఆ శాసనాలు పచ్చి మట్టి పెంకుల మీద వ్రాసి నిప్పున కాల్చి గట్టిపరచేవారు ఆ రోజులలో. ఇప్పుడు ఆ లిపి పోల్చు కున్నారు కాబట్టి వాటినన్నిటినీ చదవగలుగు తున్నారు.

చరిత్రకారులలో ప్రపితామహుడు హిరోడటస్, అతని గ్రంథంలో—

"పెండ్లికి ముందు అందరు స్త్రీలున్నూ ఆచారం ప్రకారం దేవతా సమక్షములో ఇతరులతో వ్యభిచరించాలి" అని వ్రాసి ఉన్నాడు.

బైబిల్‌లోను గూడా పూర్వ చరిత్ర ఘట్టాలలో ఈ ఆచారాన్ని కనబరిచాడు.

దీన్ని గురించి విమర్శిస్తూ సర్ ఫ్రేజర్‌గారు ఈ విధమైన పరిస్థితులు ఆశియా దేశములో చాలాచోట్ల కనబడుతూ ఉన్నవి. అవి ప్రాయము ఏమయినను, ఈ బూతుపనులు విషయ లోలత్వముచేత చేసిన పనులుకావు. మహామాత సేవలో చేయవలసిన విధాయకము. మిక్కిలి శ్రద్ధతో చేసిన పనులేగాని వేరుకాదు."

జస్టిస్ అన్న చరిత్రకారుడు వ్రాస్తూ.

"లిడియాలోనూ, సైప్రస్‌లోనూ స్త్రీలు వడుచుకొని స్త్రీధనం సంపాదించుకొనేవాళ్ళు. అందులో కొంత కోవెలకే దానం చేసేవాళ్ళు" అని వ్రాశాడు.

ఊర్లో ఉన్న పడుచు పిల్లలందరూ దేవాలయంలో ఈ పనులు చేస్తూ ఉండవలసిన రోజులుండేవి. అలా ఉండి ఉండి కొన్నాళ్ళకి పెళ్ళి చేసుకోవడానికి బుద్ధిపుడితే చేసుకోవడమూ, లేకుంటే ఆ పనులలోనే శాశ్వత కాలము వెళ్ళబుచ్చడమూ జరుగుతూ ఉండేవి. ఇప్పటికి రెండు వేల సంవత్సరాల క్రింద ఈ ఆచారాలు జరుగుతూ ఉండడం కళ్ళతో చూచినవారు వ్రాసిన వ్రాతలున్నాయి. ఈ సంగతులను బాగు చెయ్యాలని ప్రయత్నం, ప్రయత్నం చేసిన రాజులచరిత్రలున్నాయి. ఆ రోజు రోమన్ చక్రవర్తి కాన్‌స్టెంటైన్. ఈతని చరిత్రను యూసిబియస్ అన్న గ్రంథకర్త వ్రాశాడు కాబట్టి ఈ విషయాలలో ఏలాటి సందేహము ఉండ నక్కరలేదు.

## దేవదాసీలు

అలాపెళ్ళిగూడా చేసుకోకుండా జీవితకాలమంతా దేవాలయంలోనే ఈ బూతుపనులతో దేవారాధన చెయ్యాలని నిశ్చయించుకున్న స్త్రీలుగూడా ఉండేవారు. వారి జీవితకాలాన్నంతా భగవత్ సేవకోసం సమర్పించిన ఈ ఆడవాళ్లు ఆ రోజులలో గౌరవపాత్రులు. ఈ వృత్తిలో ఆర్జించిన ధనమో ధనమో వీరు దేవాలయాలకే దానం చేసేవారు. ఈలాగ దేవాలయాలకి తమ సర్వస్వమూ ధారపోసినవారు "దేవదాసీ" లయారు. అలా గుడిలోనే సర్వకాలమూ ఉండి ఈ పనులు సాగిస్తూ ఉండే స్త్రీ గుడిచేటి అయింది తెలుగులో. గుడిసేటు, గుడిశనేటు అని చెప్పే అర్థాలన్నీ తప్పులు. ఆ స్త్రీమే అరవ భాషలో దేవఅడియ(తేవడియా)అంటే దేవదాసి అయింది.

అదే స్వామిని లేక సాని అయింది వీరందరూ దేవాలయానికి చాలా ముఖ్యమైనవాళ్లు వీళ్ళని గురించి తరువాత వివరిస్తాను

క్రీస్తునాటికి ఈ దేవదాసీలు ఆ దేశాలలో ఉండేవారిని బైబిల్ లోని వ్రాతలబట్టి తెలుసుకోవచ్చును. ఆ దినాలలో స్త్రీ దేవదాసీలే కాక, పురుష దేవదాసులుగూడా ఉండేవారు. దీనిలో ఒక చిత్రం ఏమంటే ఈ పురుష దేవదాసులను 'ఖదేషిం' (గుదేషిం) అనీ, స్త్రీ దేవదాసీలను 'ఖదేషాత్' (గుదేషాత్) అని ఆ రోజులలో అనేవారు స్త్రీ దేవదాసీల పేరు "గుదెషట్" "గుడిషెట్"గా మారడానికి చాలా అవకాశముంది. మన గుడిచేటికి ఇది చాల దగ్గరగా ఉన్నమాట వీళ్లు గుడికే అంకితమై పోతారు. సృష్టికార్యం సాగిస్తూ ఉంటారు. దేవతకు సృజనశక్తిని అభివృద్ధి చేస్తుంటారు

వీరికి వేరే పని పాట్లు లేకపోయినందువల్ల కాలాన్నంతటిని అలంకరణలతోనూ. ఆటపాటలతోనూ వెళ్ళబుచ్చుతుంటారు. లలితకళలు, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం వీరి సొమ్ముగా ఉండేవి. అదే గుడి చేటులు బయటికి వచ్చి వేశ్యలయిన తరువాత వాళ్ళ కాణాచిగా మొన్న మొన్నటివరకు మన దేశంలో ఉండేవి

ఏమిటీ అఘాయిత్యం! కోవెలలో ఈ పను లెందుకు చెయ్యాలి, తప్పుకదా? అని మనం ప్రశ్నిస్తాము దీనికి జవాబు. ఆ రోజుల్లో అవి తప్పుకాదు, సరేకదా, అలా చెయ్యడం ముఖ్యం ఈ రోజులలో దేవుణ్ణి పూజ చెయ్యనివారిని లోకులు ఎలాగ నీచంగా చూస్తారో, ఆ రోజులలో ఈ పనులను చెయ్యనివారిని లోకులు అలాగ అసహ్యించుకునే వాళ్ళు. ఎందుచేతనంటే అదే ఆ రోజులలో ఆరాధన, అదే భగవత్ సేవ.

నవ్వకండి, కోపం అంతకన్నా తెచ్చుకోకండి. చూడండి!

## 18

# ఆరాధన అంటే?

ఆరాధన, భక్తి, అర్చన, పూజ ఇవన్నీ మనుష్యులకు ఉన్నవే. కాని స్వతంత్రమైన సంగతులు కావు ఎప్పుడూ ఒక్కలాగే ఉండేవి కావు దేవుడు అంటే మనకున్న అభిప్రాయంమీద ఇవన్నీ ఆధారపడి వుంటాయి దేవుడు ఒక భయంకరమైనవాడు మనుష్యులను తినేస్తాడు. కోపంవస్తే అంతా ధ్వంసం చేస్తాడు అన్న అభిప్రాయం మనకుంటే, ఆ దేవుడికి రక్తం, మాంసం, గొర్రెలు, మనుష్యులు వీటిని ఇచ్చి ఆరాధన చేస్తాం. దేవుడు నిర్వికారుడు, నిర్గుణుడు అన్న ఊహ మనకుంటే, మనం మానసికంగా ధ్యానాదులతో ఆరాధన చేస్తాం దేవుడు సర్వాంతర్యామి, ప్రకృతి స్వరూపుడు అన్న ఊహ ఉంటే, ప్రజాసేవ, విశ్వభ్రాతృత్వమూ ఆరాధన అంటాం. దేవుడు లీలామానుష విగ్రహుడు, అలంకార ప్రియుడు అన్న అభిప్రాయముంటే, మన దేవుడికి కోటూ, షరాయీ తొడిగి పెండ్లాంతో గదిలో పెటి తలుపులు చేరవేసి వస్తాం. మన దేవుడు వేటకాడయితే, వేట చేయడమే పూజా, ఆరాధనా అవుతుంది. దేవుడు తాగుబోతు అన్న ఊహ ఉంటే, తాగటమే ఆరాధన అవుతుంది. అలాగే దేవుడు పిల్లలని పుటించేవాడన్న అభిప్రాయముంటే, పిల్లలని పుట్టించడమే ఆరాధన అవుతుంది ఆ పనే పూజ, ఆ పనే పుణ్యము.

ఆశ్చర్య మేమిటి? ఇందులో దేన్నిచూచి ఆశ్చర్యం పొంద వక్కరలేదు. దేన్ని చూచి కోపం తెచ్చుకో నక్కరలేదు. ఇవన్నీ మానవుడి జీవితములో ఆ యా కాలాలకి అనుగుణంగా జరిగినవే ఇవన్నీ క్రమపద్ధతిని కలిగిన అవస్థలే. మానవ చరిత్రలో అవశ్యంగా ఉండవలసినవే. శక్తిపూజలు చూడండి. "నేతి, నేతి" అన్న దినాలు చూడండి. "తత్త్వమసి" అన్న అవస్థ చూడండి. "అహంబ్రహ్మ" అన్న స్థితి చూడండి, మానవుడి అభిప్రాయాలు ఎలాగ మారుతూ వస్తున్నాయో తెలుస్తుంది.

## మనుష్యుల అభిప్రాయాలు :

మనుష్యజాతి ఆరంభ దశలో ఉన్నప్పుడు, వారికి బోధపడని వన్నీ అపురూపాలే. తెలియనివన్నీ గొప్పవే. పసిపిల్ల వాడికి అగ్గిపుల్ల వెలగడమూ, నోటిలోనుంచి పొగరావడమూ అపురూపాలే. అదంతా ఏదో మహత్యమే కదా! అలాగే చూస్తూ ఉండగానే పొడుచుకుంటూ వచ్చిన సూర్యుడు, చంద్రుడు, అవి రాగానే వెలుతురు, అవి పోగానే చీకటి, అవి చేతికందకుండా ఉండడమూ ఇదంతా ఒక మాయ. ఒక మహత్యం లాగ కనబడేవి మన మూలపురుషులకి, వాటిమీద అసాధారణ మైన గౌరవం కలిగింది. అవి దేవుళ్ళయ్యాయి. అడవిలోని చెట్లన్నీ విరిగిపోయేటట్టు కొట్టేగాలి, అడవిఅంతా భస్మంచేసే అగ్ని, ఉన్నపాటున అమాంతంగా పొడిచేసే పిడుగు, ఇలాంటివన్నీ వారికంటికి మహత్యాలే. గొప్పలే. వీటిని అనుకుంటే వాళ్ళకి భయమే. భయంవల్ల ఇవి అన్నీ వారిదృష్టినీ, మనస్సునూ ఆకర్షించాయి. వీటికి కోపం రాకుండా ఉండే టట్టు చూడాలి. ఆ భయానికి తగినట్టే వారు వీటిని సంతోషపెడుతూ ఉండేవారు. వాటికన్నిటికీ ఆరాధనలు జరిగిస్తూ ఉండేవారు. వీటి పరి ణామాలు దుష్కలలో కనబడతాయి.

## పంట దేవుళ్ళు

కిలకల నవ్వుతూ ఉన్న చెట్లు, చేమలూ ఒకప్పుడు పాడయి పోవడము, పూస్తూన్న మొక్కలు పొటికిపోతూ ఉండడమూ, కాయా పండూ ఇస్తూ ఉన్న చెట్టు గొడ్డు పారిపోవడము, ఇలాంటి సంగతులు చూచారు. ఆకులూ, పూవులూ, కాయలు పుట్టించేవాడు ఒక శక్తి, ఒక దేవుడు అనుకున్నారు.

## సృష్టికి కావలసినవి రెండు విషయాలు

పుట్టించడం అంటే ఆనాటి బుద్ధికి ముఖ్యంగా కనబడేవి రెండు విషయాలు. ఆ రెండు విషయాల్నీ ఆ మనుష్యులు అన్నిచోట్లా చూస్తూనే ఉండేవారు. జంతువులకు పిల్లలు పుట్టడం, తమకు పిల్లలు పుట్టడం వారికి అనుభవజ్ఞానమే. ఒక స్త్రీ, ఒక పురుషుడు ఇద్దరూ ఉండాలి. ఏదయినా పుట్టించాలంటే, ఆ రెండూ సృష్టికి ముఖ్యం అని వారి నమ్మకం. ఆ రెండు విషయాల సంగమం వల్లనే ఇవన్నీ పుడుతున్నా యని వారి విశ్వాసం. భూమే స్త్రీ అంగం అని భావించారు. సరిగా భూమి కావియ్యంది, లేక భూమిలో ఉన్న శక్తి కావియ్యంది. అది స్త్రీ భాగం అయింది. దానినుండే పుడుతున్నాయి మనుష్యులకి కావలసిన చెట్లూ, చేమలూ, కాయలూ, కసరులూ. ఇది మాతృ భాగం.

ఇంక పురుష భాగం ఏది? అది దేవుడు, సూర్యుడు, ఆకాశం. దీనివల్ల శక్తికి సంతానం కలుగుతూ ఉన్నది. ఇది మన తాతల నాటి తాతకుండే ఉద్దేశం. ప్రపంచం అంతా ఈ రెండు భాగాలకు కలిగే సంగమం వల్లనే పుడుతూ ఉందని గట్టి నమ్మకం. భగవంతుడి కార్యం అంతా ఈ సంగమమే. కాబట్టి సంగమం అన్నది. చాలా పవిత్రమైన పని. దేవుడి ముఖ్య కర్తవ్యం. అదే దేవుడు. దేవుడే అది. ఈ నిశ్చయం కలిగింది ఆది మనుష్యులకు.

## ఫలం ఎల్లప్పుడూ కనబడకపోవడం ఎందుకు?

సర్వకాల సర్వావస్థలలోనూ జరుగుతూఉండే ఈ మహా సంగమం వల్ల ఎల్లప్పుతూ పంటలు పండకుండా ఉండడ మెందుకు? ఒక చెట్టు నాలుగురోజులు పళ్లనిస్తుంది, తరువాత మరి ఇవ్వదు. మహా సంగమం

ఫలిత మేమయినట్లు ? ఎందుకిలాగ పళ్ళు కనబడకుండా పోవడం ? అని ఆలోచించారు

## బ ల హీ న త :

ప్రచండంగా వెలుగుతూండే సూర్యుడు సాయంత్రం అయేసరికి కాంతి తగ్గిఉంటాడు తిరిగి తిరిగి వచ్చినప్పుడు మనుష్యుడు ఎలాగ బల హీనుడుగా ఉంటాడో అలాగే కనిపిస్తాడు సూర్యుడుగూడా చంద్రుడూ అలాగే తెల్లవారుఝామున కాంతి తగ్గిఉంటాడు. అతనుగూడా అలిసిపోయి నట్టే కనపడతాడు కాబట్టి దేవుడయినా సరే, దెయ్యం అయినా సరే ఏదయినా పనిచేసిన తరువాత అలసి బలహీనం కాకతప్పదు ఇది మను ష్యుడి నిత్యానుభవం అలాగే పుట్టించే దేవుడుగూడా అలసిసొలసి బల హీను డయిపోతారని వారు అనుకున్నాను. మనుష్యులు తమ జీవనంలో కూడా ఈ పనిచేసిన తరువాత అలసిపోవడం ఎరిగిఉన్నవాళ్ళే స్త్రీలుగూడా సంతానం కలిగిన తరువాత బలహీనం అయిపోవడం తెలిసినసంగతే కాబట్టి దేశవ క్తులకు బలహీనత కలుగుతూ ఉంటుందని అనుకోవడం న్యాయమేకదా! కాబట్టి పైని చెప్పిన రెండు అంగాలూ అలసిపోతూ ఉంటా యనిన్నీ, ఆ మహాసంగమ కార్యానికి బలహీనత కలుగుతూ ఉంటుం దనిన్నీ మన తాతలు నిశ్చయించుకున్నారు. వారు ఆనాడు చేసుకున్న నిశ్చయం ఇప్పటికీ మనలో కనబడుతూనే ఉంది.

అలసిపోయినదేవుడు ఆట్టే పనిచెయ్యలేడు పనిచెయ్యలేదంటే సంగమకార్యం చప్పనై పోతుంది పండూ కాయా బాగా పండవు పుట్టించే శక్తి కుంటుపడిపోతే, వస్తువులు పుట్టనే పుట్టవు, పుట్టినా బాగుండవు. అంతా అన్యాయం అయిపోతుంది మరేమి చెయ్యడం ? అని ఆలో

చించారు. చెయ్యడానికేముంది? అలిసిపోయినవాడికి మేకపెట్టి బలుపు వియ్యాలి. బడలిపోయినదేవునికి బలం కలిగించాలి.

## పనిచెయ్యలేనివాడికి పటుత్వం కలిగించాలి :

పని చెయ్యలేనివాడికి పటుత్వం కలిగించాలి. నడుం విరిగినవాడిని నక్కులాగ తయారుచెయ్యాలి. అలా చెయ్యడానికి పడినపాటు అంతా అర్చన అంటాము. అదే పూజ; అదే ఆరాధన. పవిత్రమైనకార్యం. దేవుని యందు భక్తి, అంతా అదే. ఈ అభిప్రాయం ఇప్పటికీ మనలో ఉంది. కొంచెం మారురూపంగా.

## సంధ్యా వందనం:

సూర్యుడు చేయవలసినయాత్ర చాల కష్టంతో నిండి ఉంది. అడుగడుగుకి అడ్డంకులే పాపమా సూర్యుడికి. మందేహాలన్న రాక్షసులు సూర్యరథాన్ని అడ్డేస్తూ ఉంటారు. ఏడు గుర్రాలున్నా కష్టాలలో ఈదవలసి వచ్చింది పాపం సూర్యుడికి. ఆ మందేహాలని నరుకుకుంటూ, చంపుకుంటూ యాత్ర సాగస్తుంటాడు సూర్యుడు. ఈ పనిలో అలసి పోతూ ఉంటాడు. బలహీనుడై పోతూ ఉంటాడు. అలాగే ఆ సూర్యుడిని విడిచి పెట్టేస్తే ఎప్పుడో ఒకనాడు సొమ్మసిల్లి పోవలసిందేకదా! మరి ప్రపంచాల గతి ఏమవుతుంది? మూడు లోకాలలో జరిగే పుణ్యకార్యాలు ఏమిగాను? అంచేత పాపం ఆ సూర్యుడికి మనం బలం ఇచ్చి బందోబస్తు చెయ్యాలి. సహాయం పంపాలి. కుమ్మక్కు ఇవ్వాలి. ఇలా నిశ్చయించుకున్నారు బుద్ధిమంతులు. ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం మూడుసంధ్యలు పెట్టారు. ఈ సంధ్యలలో సంధ్యావందనంచేసి నీళ్లు అలా విసరమన్నారు. ఆ నీటి

బిందువులు మహాతీక్షమైన బాణాలయి వెళ్ళి, ఆ సందేహరాక్షసులను చంపేస్తాయి. సూర్యుడు అడ్డులేకుండా తనయాత్ర సాగిస్తాడు.

## ఉల్టా సీదా:

ఏదో దేవుడే మనుష్యులకి సాయంచేస్తాడనుకుంటాం. కాని మనుష్యుడు దేవుళ్ళకి చేసినసాయం చాలా ఎక్కువగా ఉంది. కొంచెం లోతుకు పోయి చూడాలి గాని, సంగతులన్నీ ఉల్టాసీదాగా కనిపించక తప్పదు. దేవుడు మానవులను సృష్టించాడనీ, సృష్టి అంతటిలోనూ మానవుడే చాలా ఉత్తమమయిన సృష్టి అనీ చాలా చెప్పారు. చాలా వ్రాశారు. కాని మంచి విమర్శనబుద్ధితో సంగతులన్నీ పరిశీలించినవారు అలా అనలేకుండా ఉన్నారు. మానవులు అనేక విషయాలని సృష్టి చేశారనిన్నీ, ఆ మానవ సృష్టి అంతటిలోనూ 'దేవుడు' అన్న విషయం చాల ఉత్తమమైనదనిన్నీ అంటారు. తల్లకిందుగా కనపడుతుంది చదువుతున్న వింటే, కాని ఆలోచిస్తే నిజం అని ఒప్పుకోవలసి వస్తుంది.

## దేవుడు — మానవ సృష్టి:

చూడండి మానవుల మూలపురుషులు! వాళ్ళకి కనపడిన ప్రపంచంలో రాళ్ళున్నాయి, అడవులున్నాయి, నీళ్ళున్నాయి. అన్నీ ఉన్నాయి కంటికి కనబడుతూ, చేతికి తగులుతూ. కాని దేవుడులేడుకదా. అసలు దేవుడన్న వస్తువుని వాళ్ళెప్పుడూ చూడలేదుగదా! అలాంటిస్థితిలో ఒక దేవుడున్నాడు అని కల్పించుకున్నారు. వాళ్ళ ఊహలతో. అసలు దేవుడు అన్న అభిప్రాయాన్నే సృష్టించాడు మన మూలపురుషుడు. పేరులేని వస్తువుకి ఒకపేరు పెట్టాడు. రూపంలేనిదానికి ఒక రూపం ఇచ్చాడు. వాడికి ఈ శక్తి కల్పించాడు. ఆ శక్తి కల్పించాడు. తరతరాలనుంచి ఆ శక్తులు

ఎక్కువ చేసుకుంటూ వచ్చారు ఎన్నో గుణాలు కల్పించారు ఆ దేవుడికి ఇదంతా ఆ ఆదిమానవుడి ఊహాశక్తే అలా సృష్టించారు దేవుడిని ఒక కవి కల్పితనాయకుడిని సృష్టించినట్లు మానవుడు దేవుడిని సృష్టించాడు. పింగళిసూరన్న కళా పూర్ణుడిని సృష్టించినట్టు, గురజాడ గిరీశాన్ని సృష్టించినట్టు, మన మూలపురుషుడు దేవుడిని సృష్టించాడు గుణం మీద గుణం, లక్షణంమీద లక్షణం, శక్తిమీదశక్తి ఇచ్చాము మనం ఆ దేవుడికి అన్నిగుణాలూ ఇచ్చి ఒక పెద్దస్థానాన్ని కల్పించి, దానిలో ఒక సింహాసనం ఉంచి, దానిమీద కూర్చో పెట్టాం మనం ఆ దేవుడికి ఆ స్థానం ఇచ్చింది మానవుడు ఆ శక్తులిచ్చింది మానవుడు. ఆ మహాత్మ్యం ఇచ్చింది మానవుడు అందుకే మానవుడే దేవుడిని సృష్టించాడు అని అనడంలో అపూయిత్యం లేదు. ఉదారబుద్ధికలవాళ్లు ఆలోచించాలి, ఆగ్రహించుకోకుండా. అంతస్థులలో ఒక అంతస్థు మనం ముచ్చటిస్తున్నా ఈ సహాయం.

## దేవుళ్ళకి చేసే సహాయం:

అలా దేవుళ్ళకి సాయం చెయ్యడం మానవులపని అయింది ఆ సాయం అనేకరకాలుగా ఉండేది. ఒక్కొక్కప్పుడు సూర్యుడికి ఇచ్చినట్టు మరి నాలుగు బాణాలూ ఆయుధాలూ ఇవ్వడం ఒక్కొక్కప్పుడు ఆ దేవుడు చేసేపని ఏదయితే ఆపనే చేయడం. ఒక్కొక్కప్పుడు ఆ దేవుడికి కావలసినదానిని దానంచేయడం ధారపోయడం . అనేకరకాలు ఈ సాయం చేయడం ఈ ఆరాధన, అందులో అనుకిరణం అన్నది ఒక రకం

## మనలో అనుకరణాలు:

వర్షంలేకపోతే మనదేశంలో ఇప్పటికీ చేసే ఆచారాలు ఈ అనుకరణంలోనికి వస్తాయి కొందరు ఒక కప్పని పట్టుకొని దానిమీద నీళ్ళు

పోసుకుంటూ తిరుగుతారు కొందరు గ్రామస్తు లందరూ కలిసి ఒక్క-సారి కేకలు వేస్తారు ఉరుములా గుండేటట్టు. అదంతా అనుకరణం. మనలో ఉంది మూఢభక్తి అని కొట్టి పారేస్తాము ఇప్పుడు మనం కాని ఆ రోజులలో అది అలా జ్ఞానంతో కూడిన భక్తి. నాగరక ఆలోచన-సభ్యమైన ఆరాధన అసభ్యమూకాదు అనాగరకతా కాదు

## బూతు అంతా దేవతార్పణం:

ఆ అనుకరణం చాలాకాలం అలా ఆచారంగా ఉండేది పుట్టించే దేవుడు బలహీనం అయితే అనుకరణపద్ధతి ప్రకారం పుట్టించేపని అందరూ చేస్తూ ఉండడం ఆరాధన అవుతుంది ఈ పని ఎంత ఎక్కు-వగా జరుగుతూ ఉంటే ఆ దేవుడిబలం అంత ఎక్కువ అవుతూ ఉంటుంది అంతకన్నా జన్మసార్థక్యం మరొక్కటిలేదు అంతకన్నా పుణ్యకార్యం మరొక్కటిలేదు. అందరూ చెయ్యవలసిన పని అదేకావాలి. ఈ ఆరాధన దేవాలయంలోనే కదా జరగాలి ఈ బూతుపని అంతా ఇప్పుడు కృష్ణార్పణం అని మనం అంటున్నట్టు. అప్పుడు దేవతార్పణం అని భావించేవారు వాళ్ళు చేస్తూ ఉన్న పని అంతా ఆ మహాసంగమానికి బలం కలిగించే పోషణ, అందులో ఉండే పురుషభాగానికి ఉమ్మక్క-దోహదం అన్నమాట

## లింగపూజ:

ఆ రోజులలోనే దేవుడిని పురుషభాగంగా భావించారు దేవుడనేది ఒక గొప్ప పురుషాంగం ఆ పురుషభాగమే మన దేవతా నామాలలో లింగం అయింది ఆ స్త్రీభాగమే పానవట్టం అంటున్నాం ఇవి ముద్దు పేరులు వీటి ఆకారాలని బట్టి ఆ రెండూ ఏమిటో తెలియనే తెలుస్తూ ఉంది దీనిలో ఏమీ సంశయం ఉండనక్కరలేదు

# పురుష అంటే?

అసలు దేవుడిని, పరమపురుష, మహాపురుష అని పురుష అన్న పదం వాడుతూ ఉన్నాంకదా! ఈ పురుష అన్నమాటకి అర్థం ఏమిటి? కొంచెం తర్కభావంతో అవలోకనం చెయ్యాలి. మనిషూసి మారేడుకాయ చేసే విఘంటువులను నమ్మకూడదు. అవి సత్యమైనవికావు వ్యుత్పత్తికి దిగినప్పుడు. దాని వాస్తవమైన అర్థం: చొచ్చుకొని పోవుచున్నది. దూరుకొని పోవుచున్నది. దానినుండే పూరించు అంటే అ అర్థంవస్తుంది. ఇంకా అనేక దృష్టాంతాలు అనేక భాషలలో ఉన్నాయి. ఈ అర్థంలోనే ఆ పురుషనామము భగవంతుడికి కలిగింది. ఆ పురుషుని వర్ణించిన వర్ణనలు అన్నీ ఈ అర్థమే ఇస్తాయి. ద్వాదశాంగుళ ప్రమాణం మొదలైన వర్ణనలన్నీ దీనికి సంబంధించినవే. ఇప్పుడు మన పండితులు డొంకతిరుగుడు అర్థాలుచెప్పి వేదాంతం తినిపిస్తారు. కాని, ఆదిలో ఇది అదేకాని వేరుకాదు.

# నిజమైన అర్థం ఉన్న దేశాలు

మనదేశంలో బుద్ధిమంతులు ఎక్కువ. కాబట్టి, విపరీతార్థాలకి పూనుకున్నారు. కాని ఈ ఆచారం ఒక్క మనదేశంతో తీరిపోలేదు. పురాతన ప్రపంచం అంతటా ఉంది. ఆ దేశాలలో వీటి యథార్థాన్ని కప్పిపుచ్చలేదు. అవి తప్పు ఆచారం అని తెలిసిన తరువాత దానిని విడిచిపెట్టారు. అంతేగాని,కొత్త అర్థాలు కల్పించలేదు. మనవారో అంటే

పూజలు సాగిస్తూనే వచ్చారు. అర్థాలుమాత్రం మార్చేదాం అని చూచారు.. సాగించారు. కొన్నాళ్ళకు ఆ ఆట.

## లింగానికి అభిషేకం

ఫ్రాన్సులో 1584 సంవత్సరందాకా ఎంబ్రమ్ అన్న పట్టణంలో ఇలాంటి ఒక మహాలింగం ఉండేది. అది సాక్షాత్తు భగవంతుడిది అని అనకుండా, ఆ దేశంవాళ్ళు సెయింటుఫొటిన్ అన్న మహానుభావుడిది అనుకునేవాళ్ళు. సంతానం కావలసిన వాళ్ళు, దాంపత్యసుఖం కావలసిన వాళ్ళు ఆ లింగానికి అభిషేకం చేసేవాళ్ళు. ద్రాక్షరసం ఆ లింగం నెత్తిన పూసి ఎర్రగా ఉండేటట్టు జేసేవారు. అక్కడ వాళ్ళు మరేమి వింత అర్థాలూ చెప్పలేదు. యథార్థాన్నింగానే సాగించారు. సాగించి వన్నాళ్ళు. మానుకున్ననాడు మానుకున్నారు.

కొన్ని స్థలాలలో ఈ లింగాన్ని ముద్దు పెట్టుకోవడమూ ఇంకా అసభ్యపు పనులు - మనదృష్టిని - చేయడమూ గూడా ఉండేది. కాబట్టి అసలు అర్థం ఏమిటో ప్రపంచం అంతా చాటుతూ ఉంది. దేవుడు పురుషలింగం; దేవి స్త్రీ పానవట్టం (= యోని) ఈ విధానం లింగ యోని విధానం. ఈ విధానానికి ఆరంభం పైని చెప్పిన ఉద్దేశం. అందుచేత దేవాలయాలు ఈ మహాకార్యానికి మూలస్థానాలయాయి. బూతుపని అనేదే పుణ్యకార్యం అయింది. దేవతాలంకరమూ భగవత్ప్రీతి అయింది.

## మసిపూసి మారేడుకాయ :

మనదేశంలోనే కాదు; ఇతరదేశాలలో గూడా ఈ లింగపూజ లుండేవి; ఉన్నాయి. లింగం అన్నది పురుష అవయవమని వారు చెపుతారు. దానికి తగినట్టే ఆరాధన చేస్తారు. కొన్ని దేశాలలో ఈ లింగము పురుష విగ్రహానికి తగిలిఉంటుంది. కాబట్టి బొంకడానికి వీలుండదు. మనదేశంలో ఈ లింగం కేవలం రాతికొయ్యలా గుంటుంది. అందుచేత ఇది పురుషావయవం కాదనీ, అదేదో ఒక చిహ్నం అనీ, దానికి అంతరార్థమూ, వేదాంతార్థమూ ఉందని పెద్దలు చెప్పటానికి అవకాశముంది. అది మసిపూసి మారేడుకాయ చేయడమే; విలవని వ్యర్థప్రయత్నం.

## చిహ్నం అంటే ఎలాంటిది?

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములో ఉండిన అష్టదిగ్గజాలలో ఒకడు ధూర్జటి కవి. ఇతడు మహా శివభక్తి తత్పరుడు. "శ్రీ కాళహస్తి మహాత్మ్యము." "శ్రీకాళహస్తీశ్వర శతకము" అన్న ఉద్గ్రంథాలు వ్రాశాడు. ఆ శతకంలో ఒక పద్యంలో—

> "నిన్నేరూపముగా తలంతు మదిలో నీరూపు మోకాలో,
> స్త్రీ చన్నో, కుంచమొ, మేక పెంట్రుకయొ"

... .... ... ...

అన్నాడు. మోకాలు, స్త్రీ చన్ను, కుంచము, మేక పెంట్రుక వీటిలో ఈశ్వరుడి రూపం దేనిగా భావించడం అని సందేహిస్తున్నాడు ధూర్జటి. ఈ నాలుగింటిమీదనే సందేహం కలగడానికి కారణం లేకపోలేదు. శైవగ్రంథాలలో కొన్ని కథలున్నాయి. ఆ కథలలో పాత్రలు ఒక్కొడావిని

లింగంగా భావించి పూజలు చేసినట్టూ, ఆ పూజల ఫలితంగా వారికి ఈశ్వర కరుణ కలిగినట్టూ వర్ణనలున్నాయి. ఈ నాలుగింటిలో ఏ రూపంగా భావించమంటావని ఆ శివుడినే అడిగాడు చిహ్నం అనినా, గుర్తు అనినా అలాగ ఏదో ఉండాలి కాని మన పూజ లందుకుంటున్న లింగం అలాంటిదికాదు.

## సత్యానికి చాటెందుకు?

ఎందుచేతనంటే, ఈ శివలింగం ఏమిటో, అది ఏ విధంగా పూజార్హమయిందో, ఆ వివరాలన్నీ ప్రస్ఫుటంగా మన పురాణాలలో వర్ణించి చెప్పారు. ఆ సంగతులనే కవి సార్వభౌముడు శ్రీనాథమహాకవి తన "హరవిలాసము" అన్న కావ్యంలో ఎంతో భక్తి తాత్పర్యాలతో వ్రాశాడు. అదేదో లజ్జాకరమైన విషయమని మన 'మడిబట్టల' పరిష్కర్తలు ఆ భాగానికి చాటు పెట్టారు సత్యానికి చాటెందుకు చెప్పండి పంచాంగం దాచేస్తే చుక్కలు పోతాయా?

## సంగతేమిటంటే!

పెళ్ళి అయిన తరువాత శివుడు హిమవంతుడి ఇంట్లో మనుగడుపు అల్లుడుగా క్రీడాలోలుడయి ఉంటాడు అతని సిబ్బంది-ప్రమథగణాలు చెలరేగి అన్ని విధాలా అవాచ్య కార్యాలూ చేయడం ఆరంభించారు ఈ అలజడి మాన్పించాలని హిమవంతుడు ఆలోచిస్తూ ఉంటాడు ఈ సంగతి గ్రహించి శివుడు ఎవ్వరితోనూ చెప్పకుండా దారుకావనానికి పోతాడు ఆ వనంలో మహారుషులు తమ సంసారాలతో సుఖంగా ఉండేవారు. వారి భార్యాపిల్లలను చూచిన శివుడికి మదనోద్రేకం కలిగింది. ఆ రుషిపత్నుల పాతివ్రత్యానికి భంగం కలిగిస్తున్నాడు. రుషులు కోపంతో ప్రతికారం

చెయ్యాలని ఆలోచిస్తున్నారు ఆ సంగతి గ్రహించి శివుడు తన పురుషాంగాన్ని విపరీతంగా పెంచేశాడు ఈ ఘట్టంలో శ్రీనాథుడు చెప్పినది చూడండి

"ఇట్లు పరమధూర్తవర్తనంబునం బ్రవర్తిల్లునయ్యష్టమూర్తి. కట్టిన కౌపీనంబు దలంగవైచి మదనధ్వజదండంబు విగుడించి, యమ్మహనీయ సాధనంబున నమ్మహీసురోత్తములయుత్తమాంగంబులు .. మెదడు తొరఁగ నడంచియుఁ, జెవులు కొరడంకలొత్తియు, మొగంబులు .. ముక్కులు నొక్కియు, బరులు వ్రేసియు వీపులు చదిపియుఁ, బండ్లు రాల్చియు, నుదుటంబులు రాచియుఁ, ద్రికంబులు దాకించియు జంఘలు పొడిచియు, జానువులు తాటించియు, ఒదలు పడవైచియు.. యార్చి, పేర్చి యమ్మహాలింగంబు లింగిదాఁకం బెరిగించి బ్రహ్మాండకర్పరం బప్ప శింపఁజేసిన

సురగరుడఖచరవిద్యా
ధరకిన్నర సిద్ధసాధ్య దానవముఖ్యుల్
పురహరుఁడు చాఁచిపట్టిన
యురులింగంబునకు మ్రొక్కి యురుతర భక్తిన్

సంస్తుతింపఁ దొడంగి రప్పుడు. బ్రహ్మ యమ్మహాలింగంబునకు అభిషేకం బాపాదించి

"జయ జయ శివలింగ జ్యోతిర్మహాలింగ లింగోద్భవ శ్రీ మహాలింగ వేదత్రయీలింగ పర్లింగ.........సారంగలింగాత్మ ఖాలింగ, బిందులింగ, ఈశలింగ, ఓంలింగ దివ్యాత్మ నానావిధాపాదలింగ నమస్తే నమస్తే నమః"

ఇట్లు పూజించి విరించి కరకమలంబులు మొగిడ్చి యిట్లనియె:

శివియు శర్వ ! మహాదేవ ! ధిక్కరింపు.
ముదుపుమహిరాజకంకణ ! యదపు రుద్ర !
వాల్పు ఖట్వాంగపాణి ! వదల్పు మభవ !
మోహనంబైన వీ మహా మేహనంబు.

అనినఁ బ్రసన్నుఁడై కహకహధ్వని నవ్వి లలాటనేత్రుఁ డి
ట్లను భువనంబులెల్ల వినునట్లుగ నోపరమర్షులార ! యో
యనిమిషులార ! తక్కుఁగలయట్టి సురాసురులార ! మీకు నా
యనుపమదివ్యలింగ మిది యర్చన కర్హము నేఁట నుండియున్.

అని శంభుండు.... నిజమహాలింగ స్తంభంబు స్తంభింపజేసె....
నప్పుడు ముకుళిత హస్తాబ్జంబులై దేవదారు వన దివ్యాశ్రమస్థులగు
గృహస్థులీర్ష్యాదోషంబు లుజ్జగించి యా శేషాహిభూషణుని బహువిధం
బుల భక్తి విశేషంబుల భజియించిరి.

# తార్కాణలు:

భగవంతుని సమక్షంలో ఇలాంటి పూజలు జరుగుతూ ఉండడం చాల తరుచు. తార్కాణలు కావాలి అన్నవారికి తండోప తండాలు. అవతల ఫినీషియా, బాబిలోనియా, అస్సీరియా, గ్రీసు, పర్షియా; ఇవతల జావా, చీనా; అవతల అమెరికా, న్యూగినీ ఎటుచూస్తే అటు అంతా ఈ ఆచారం కనబడుతూ ఉంది. ఇంతింత దూరంగా వుండే దేశాలలో ఇంత స్పష్టంగా కనబడుతూ ఉన్న ఆచారానికి అన్యథా అర్థం కల్పించడానికి చూస్తే అన్యాయం అవుతుంది. సత్యంవద అన్న ఆదేశానికి పరస్పర విరుద్ధం అవుతుంది. ఆ యా దేశాలలోని దేవాలయ నిర్మాణమూ, మనకు అనాది నుండి వస్తూ ఉన్న దేవాలయ నిర్మాణమూ ఒక్కలాగే ఉంటాయి. ఒక్క ఉదాహరణ చూడండి. దగ్గరదీ దాపరిదీ కాదు, వేలకొద్దీ మైళ్ళ దూరంలో ఉన్న న్యూగినీలోనిది. చూదాం.

## న్యూగినీలోని దేవాలయం:

ఒక పెద్దఇల్లు, అందులోని విగ్రహాలకి స్త్రీ అవయవంగాని, పురుష అవయవంగాని మితిమీరిన సైజులలో చాల పెద్దవిగా ఉంటాయి. ఇటూ అటూ

వరండాలో కర్రతో చేసిన స్త్రీ పురుష ప్రతిమలుంటాయి. ఆ ప్రతిమలు కళాశాస్త్రం పద్ధతిని కలిసి ఉంటాయి. అదే దేవాలయం. అదే పెళ్ళికాని స్త్రీ పురుషులకి పడకగది గూడాను. వీళ్ళందరూ భగవత్సేవ చేస్తూనే ఉంటారు. ఆ దేవత బలహీనం గాకుండా, దేశంలోని ప్రజలను పోషిస్తూ ఉంటాడు- ధర్మం నాలుగు పాదాలమీద నడుస్తూ అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉంటుంది.

## పాపాప్ లోని ఆరాధన:

ఇలాగే ఉంటుంది. కాని ఇంతకన్నా అద్భుత మహత్యం కలది పాపాప్‌లోని దేవాలయం. ఇది క్రైప్ అన్న ద్వీపంలో ఉండేది. ఈ దేవాలయం అంతా ఒక పెద్ద బూతు పురాణంలాగ కనిపిస్తుంది మన కొత్త ఉద్దేశానికి. అక్కడ జరిగే పనులూ, ఆచారాలూ గ్రంథాలలో ప్రమాణాలుగా ఉన్నాయి. ఇక్కడ దేవాలయాలన్నీ చిత్రవిచిత్రమైన కళాశాస్త్రపు బొమ్మలతో నిండిపోయి ఉంటాయి. ఏమీ తెలియని వాటిని గూడా రంగంలోకి దింపుతూ ఉంటాయి. కొత్త కొత్త మార్గాలన్నీ నేర్పుతూ ఉంటాయి. శ్రీశుకుడు లాంటి వాడినిగూడా స్త్రీ సుఖంకోసం అవస్థ పడేటట్టు చేస్తాయి. ఇకను దేవాలయంలోనో-స్త్రీ పురుషుల కలయికలు, వినోదాలు, అగచాట్లు, ఎంపుళ్ళకోసం కనిపెట్టుకొని ఉండడాలూ అన్నీ అంత శ్రద్ధాభక్తులతో జరుగుతూ ఉంటాయి. అక్కడ సంభాషణలన్నీ పచ్చి శృంగారమే. ఆ స్థలమూ, అక్కడి గాలీ, అక్కడి వాతావరణమూ అంతా మనస్సుని విశృంఖలమైన భక్తిలోనికి దించేస్తుంది. ఏకాగ్రచిత్తంతో స్త్రీ పురుషులు వాళ్ళ కర్తృత్వాన్ని నిర్వహించుకుంటూ ఉంటారు. ఎప్పుడూ నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉంటూ ఉండేది.

34

## రతి విలాస పానీయాలు

అక్కడున్న దేవుడిపేరు లెగ్బా. ఆ దేవాలయంలో జరిగే కోలాహలం వర్ణనాతీతంగా ఉంటుంది. అక్కడ దేవుడి భార్యలు చాలామంది ఉంటారు. వాళ్ళు మహాభక్తురాళ్ళు అన్నమాట. వాళ్ళూ ఊళ్ళోవాళ్ళూ కలిసి దేవతారాధనానికి పూనుకుంటారు. మహా సంగమ ధర్మాన్ని నిర్వహిస్తూ ఉంటారు. అలసిపోతారేమో అన్న భయం ఉంటుంది కదా ఎలాంటి భక్తు లయినప్పటికిన్నీ! అంచేత స్త్రీ పురుషులకి కొంచెం రతి విలాసం కలిగించే ఔషధాలుగూడా ఇస్తూ ఉంటారు. ఆ ఔషధాలు పుచ్చుకునేది. ఒళ్ళు కానకుండా విహరించేది. దేవ కైంకర్యంచేస్తూ ఉండేది. మోక్షం చూరకొంటూ ఉండేది.

## నిత్య శోభనపు గదులు

సంగమం చెయ్యడమే సత్కర్మ. అవయవాలను పూజచెయ్యడమే ఆరాధన. దేవాలయాలన్నీ నిత్య శోభనపు గదులు. అక్కడి సంగతులన్నీ సంగమ కార్యానికి చేయూత నిస్తుండాలి. మంకులాంటి మనిషికైనా మన్మథావేశం కలిగించాలి. చేతకాని వారికైనా సిద్ధహస్తుల్ని చెయ్యాలి. అందుకోసమే ఆ బంధప్రతిమలు, ఆ కళాశాస్త్ర పరిస్థితులు, ఆ వ్యభిచరించాలన్న నియమాలు, ఆ యోనిలింగ దేవతాకారాలు, ఆ పురుష శబ్దాలు.

అసలు తత్వాన్ని తెలుసుకొని, అలా ప్రపంచంమీద ఒక్కసారి కన్ను నాలుగు ప్రక్కలా త్రిప్పామంటే, చాలా చిత్రమైన సంగతులు కనబడతాయి. మడి కట్టుకున్న చెవులకి మతులు పోతాయి. మన సనాతన దృష్టి వాళ్ళకి చచ్చినంతపని అవుతుంది.

35

## నిజంగా సనాతనులు ఎవరు ?

మన సనాతన దృష్టివాళ్ళు. అని ఎందుకన్నానంటే, వీళ్ళు నిజమైన సనాతనులు కారుకాబట్టి. నిజమైన సనాతను లన్నవాళ్ళు మన మూల పురుషులు. ఆది విరాట్టులు. ఆ బూతుపూజలు చేస్తూ ఉండేవారు. ఆ మహా సంగమానికి దీక్షపట్టిన దీక్షితులు. అదేపనిగా అసంగసంగరాలు చేస్తూ వుండే అవధానులు. ఆ బాల్యమూ ఆ బూతుపనులు చేయడమే పనిగా పెట్టుకున్న స్త్రీ పురుషులు. వాళ్ళు నిజమైన సనాతనులు; కల్తీ లేని జాతి. కల్మష మెరగని తెగ. మానవజాతికి పునాదులు వేసిన పుణ్యమూర్తులు. సనాతనులంటే వాళ్ళే సనాతనులు. తక్కినవాళ్ళని సనాతను లనడం కుక్కను కుంభినీపతి అనడం లాంటిది.

## సనాతన ధర్మమూ, సంకర ధర్మమూ !

ఇప్పుడు సనాతనుల మనుకుంటూ, శాస్త్రాలు ఉన్నాయని బడాయి కొడుతూ, శాసిస్తుంటూ, ఆంక్షలంటూ శాసనాలుచేస్తూ తైతెక్కలాడుతూ ఉండే పెద్దపేరుల వాళ్లూ, పెద్దబొట్టుల వాళ్లూ వీళ్ళంతా అధునాతనులు. నిన్నమొన్నటి వాళ్ళు. ముక్కుపచ్చ లారకుండా ఉన్న మొద్దులు. జరిగినదీ, జరుగుతూ ఉన్నదీ, జరగబోయేదీ ఏదీ తెలియదు. దేనినీ తెలుసుకోరు. తెలుసుకోడానికి ప్రయత్నం చేశారో, బతుకు తెల్లవారుతుంది. సనాతనధర్మం అంటూ చంకలు గ్రుద్దుకుంటూ ఉన్నదంతా సంకరధర్మం అని చక్కగా తేలుస్తుంది. వాళ్ళ ధర్మాన్నా వీళ్ళ ధర్మాన్నా పుట్టిన బిడ్డని వంశకర్తగా చేసుకోవడం లాంటిది. ఎప్పటినుంచి వచ్చిందో ఈ సనాతనం అడగండి. ఆ పెళ్ళిళ్ళు ఆ ఆచారాలు ఎలాగు వచ్చాయో కనుక్కోండి. ఈ మేనరికాలు ఏమిటో అడగండి. ఈ అస్పృశ్యత ఎలాం

టిదో చెప్పమనండి. అదుది సమ ర్తాడితే చిమ్మిలి దంచడమూ, పంచిపెట్ట డమూ ఎందుకో అడగండి. పిల్లలు కావాలి అంటే రావిచెట్టుని కౌగలించు కోడం ఎందుకు? ఎవరి ఆచారాలు ఇవి? వాటి అర్థాలేమిటి? ఎప్పటి నుంచి చేశాము దీన్ని సనాతనంగా? ఎక్కడి నుండి ఎత్తుకవచ్చాం వీటిని? అంతకు ముందు మనవాళ్ళకున్న ఆచారాలకి ధర్మానికి మరేపేరు పెడదాం? ఇలా పుట్టుకొని వస్తాయి ప్రశ్నలు, తెల్లపోతాం. ఈ సనా తనం అనుకుంటున్న దానిలో సంకరం ఎక్కువ నానాగోత్రేభ్యః సూత్రం చాలా బాగా అన్వయిస్తుంది కల్తీ చాలా ఎక్కువ, కల్మషం పెరిగివుంది ఈ సనాతనంలో కాబట్టే సనాతనులు కొంచెం శాంతంగా ఉండాలి

## భూమి అంతటా వున్నాయి బూతుపూజలు :

ఈ బూతుపూజలు ఎక్కడో ఒకమారు మూలలో ఉండేవి కావు. ఎవరో ఒక జాతికిమాత్రం చెందినవికావు. భూమి అంతటా ఉన్నాయి ఈ బూతుపూజలు విశ్వమంతటా కనిపిస్తుంది బూతుపూజల విశ్వరూపం ఆ రోజులలో నాగరికత, సభ్యత ఉన్న దేశాలంతటిలోను ఉన్నది. ఈ పవిత్ర పూజ.

## అ నా హి త పూ జ లు:

పర్షియా దేవత అనాహిత ఎరెక్‌లో ఉన్నది. ఇది సంతాన దేవత. ఈ అనాహిత దేవతకు పూజ బూతే దేశదేశాల నుంచీ గొప్ప గొప్పవాళ్ళ కూతుళ్ళు యీ దేవాలయానికివచ్చి అక్కడ పై వాళ్ళతో వ్యభిచరించాలి. తరువాత కావలిస్తే పెళ్ళిచేసుకోవచ్చు.

## స్తంభాల పూజ :

మశ్శేభా. అష్షేరా అన్న స్తంభాల పూజలు ఉన్నాయి. ఇవి పొడుగుపాటి స్తంభాలు అనగా లింగాలు. ఈ పూజలో దేవత పేరులు ఎలాగుంటా యంటే – పొడుగైనది, బలమైనది. ఉత్తానము = నిట్టగా ఉన్నది. ఇలాంటివి మన సహస్రనామాలలోనూ వున్నాయి.

## మిళితా దేవత :

బాబిలోనియా మిళితా దేవతకు ఈ పూజ చెయ్యాలి. స్త్రీలు వారులు తిరి రోజుల తరబడిని కనిపెట్టుకుంటూ ఇతరులతో వ్యభిచరించి, వారిచ్చిన సుంకాన్ని దేవతార్పణం చెయ్యాలి. ఎల్లప్పుడూ చెయ్యకపోయినా సంవత్సరానికొక్కసారైనా ఇలాగ చెయ్యాలి. లేకుంటే మహా పాపం. మరి కొన్నాళ్ళకి జీవిత కాలం అంతటిలోనూ ఒక్కసారైనా చెయ్యాలన్నారు. ఇది తప్పుగా తలచి కాదు. ఆచారంగా తలచి, పుణ్యమని తలచి. కోవెలలో ఈ స్త్రీలు భర్తీ అయి వుంటారు. క్రిక్కిరిసి వుంటారు. వరండాలలో సంగమాలు జరుగుతుంటాయి.

## లిడియాలో :

లిడియా ఆ రోజులలో చాల ప్రసిద్ధి పొందిన దేశం. ఎక్కువ నాగరికత కలది. అక్కడ పడుచుపిల్లలు ఈ బూతుపూజలు చేస్తూ తమ స్త్రీధనాన్ని సంపాదించుకుంటూ వుంటారు. ఆ ధనంతో భర్తలను చూచుకుంటారు. కొందరు ఎన్నో సంవత్సరాలు అలా వుండిపోతూ ఉంటారు.

## హేలియో పాలిసు లో :

సిరియా (సురం దేశం) లో హేలియో పాలిసు (హేలిపురము - సూర్యనగరం అన్నమాట) అన్న ఊరిలో ప్రతి ఆడుది అలా బూతు పూజ చెయ్యాలి. పిల్లం తల్లులూ, పెళ్ళిలేని పిల్లలూ, చాలామంది "మేమింత శ్రద్ధాభక్తులతో బూతుపూజలు చేశాము" అని వ్రాసి వాళ్ళ భక్తిని ప్రకటించారు.

## ఫినీషియా గుళ్ళ లో :

ఫినీషియా గుళ్ళలోనూ ఈ పనులే చాలా పవిత్రంగా జరుగుతూ ఉండేవి. అందులో ఆరేలియా ఇమీలియా అన్న స్త్రీ తన దాన శాసనంలో వ్రాస్తూ, "మా తల్లి, ఆ తల్లి తల్లి తరతరాల నుంచీ ఈ భక్తి ఇలాగ చూపుతూనే వచ్చారు" అని తన కులగౌరవం పొగడుకుంది.

అస్టరటు, ఎష్టారి మొదలైన దేవతల పూజలన్నీ ఇలాంటివే.

## గ్రీసు లో :

డయోనిసను ఉత్సవాలు అన్నీ బూతుల బుంగలు. ఇప్పటివాళ్ల వినడానికీ, కనడానికీ తగనివి. కాని అవి చాలా పవిత్రమైన భావాలతోనే జరిగేవి.

"ఎలిషియను మిస్టరీసు" అన్న ఆచారకాండ చాల మట్టుకు ఈ బాపతుదే.

ఇవన్నీ మన చేరువలో ఉన్నవి. దూరానఉన్న సంగతులున్నూ ఆ ఉత్సవాలున్నూ అలాంటివే. అలాంటిదే మహా మాతపూజ.

39

# 'మా' దే వ త:

మన దేవీసహస్రనామాలలో 'మా' అన్న పేరు ఒకటి ఉంది. ఈ పేరుకి లక్ష్మి అని ఇప్పటి అర్థం. కాబట్టే మాధవుడుఅంటే లక్ష్మి భర్త-విష్ణువు అని అంటాం. ఈ 'మా' అన్న పేరుతో మన హిందూదేశంలో ఎక్కడా ఒక కోవెలగాని,ఒక దేవతగానిలేదు. ఇంతకుముందు ఉండినట్టు గూడా రుజువులేదు. నిఘంటువులలో మాత్రం ఉంది. కాని కాపడోషియా అన్న దేశంలో కామన లేక కోమన అన్న ఊరిలో పూజలను పొందుతూ ఉన్న దేవత పేరు 'మా'।కామనప్రజలందరు.ఆ'మా'పిల్లలు(మనకుగూడా 'మా' కుమారుడు కాముడు) ఆ'మా' దేవతపూజలుగూడా ఇంతకుముందు నేను వ్రాసిన లాంటివే.

# మ హా మా త పూ జ లు

మహామాత అన్నపేరుతో అనేకదేవతలున్నారు. ఆ దేవతలందరూ మహాసంగమ కార్యానికి మూలధారాలు. ఆ మహామాత పూజలన్నీ పైని చెప్పినలాంటివే. నిత్యకల్యాణాలు. సర్వకాల సర్వావస్థలలోనూ ఈపనులు జరుగుతూ ఉండవలసినవే, కొన్నిచోట్ల స్త్రీలు బారులు దీరికూర్చుంటే పురుషులు వచ్చి ఎంచుకొని, ఏరుకొని వారిని తీసుకొనిపోతారు. కొన్ని చోట్ల స్త్రీలు వాళ్ళ కంటికి కనిపించిన మొదటి కొత్తవాడితో సంగమిస్తారు. కొన్నిచోట్ల సంగమానికి ధనంపుచ్చుకొని, స్త్రీలు దేవత కారాధన చేస్తారు. కొన్నిచోట్ల సంగమ ప్రసంగాలూ, పాటలూ కోవెలలో ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. గొప్పవారు,పేదవారు అన్నవిచక్షణలేకుండా అన్ని ఇళ్ళవాళ్ళూ ఈ పనికి పూనుకుంటారు. కొన్నిచోట్ల స్త్రీలు తమ స్త్రీశక్తిని దేవత కర్పిం చేస్తారు. కొన్నిచోట్ల పురుషులు తమ పురుషశక్తిని అర్పించేస్తారు. వాళ్ళు

ఎల్లకాలమూ కోవెలనాశ్రయించుకొనే ఉండిపోతారు. అలాగ దేవతలకు స్త్రీపురుష శక్తుల నిచ్చి ధన్యులవుతారు.

## పురుషశక్తిని అర్పించడం :

సంగమ కార్యాలను విరాఘాటంగా జరుపుతూ దేశంలో ఉన్న ప్రజలందరూ తమ భక్తిని చూపిస్తూనే ఉంటారు. కాని భక్తులలో మహాభక్తులంటూ ఉంటారుగదా। తీవ్రమైన ఆవేశంకలవాళ్లు. మరి వీళ్ళు మహాభక్తిని చూపించడం ఎలా? పలుగురితోపాటు తానుచూపుతే పలుగురిలాంటి భక్తుడే అవుతాడుగాని ఎక్కువవా డవుతాడా ? అంతమాత్రంతో ఆ మహాభక్తుడికి సంతృప్తి కలుగదు. తాను తనలోవున్న సర్వశక్తినిదేవత కర్పించినంత వరకూ శాంతిఉండదు. అందుచేత కోవెలలో మహాపవిత్రమైన ఉద్దేశంతో ఉత్తమమైన భక్తితో అందరూ మెచ్చుకుంటూ ఉండగా ఈ మహాభక్తుడు తన పురుషశక్తి నంతటినీ ధారపోసి అర్పిస్తాడు. ఈ అర్పణ అనేక రూపాలుగా ఉంటుంది. అవయవ సమర్పణం,ఆధారసమర్పణం కేవలం పురుష బల సమర్పణంగా ఉంటుంది.

యుసిబియస్ అన్న చరిత్రకారుడు "పెట్రొలోజియా గ్రీషియా" అన్న గ్రంథంలో "మెన్ హు కాస్ట్రేటెడ్ దెమ్‌సెల్వ్స్ ఇన్ ఆనర్ ఆఫ్ ది గాడెస్" దేవత కొరకు నిర్వీర్యులయినవారు అని ఈ పండితులను గురించి చెప్పారు.

మిగ్నిస్ అన్న అతడుగూడ ఈ ఆచార మున్నదని వ్రాశారు.

వెస్టర్ మార్క్ ఇలాంటివి అనేక సంగతులు వ్రాస్తూ, పురోహితులు కావాలన్న వాళ్ళు కొన్నిచోట్ల, నపుంసకత్వంతో తృప్తిపొందక స్త్రీత్వంకూడా పటించాలని వ్రాశాడు. అంటే ఇంకొక పురుషుడితో తాను

స్త్రీలాగ కలిసి ఉండాలి. అలా చెయ్యకపోతే,వాడికి ఖొరాన్ బాగా నేర్చుకొనే శక్తి అలవడదట, వాళ్ళకి తగినంత మహత్వం కలగదు.

## పురుషులు—పురుషుల సంగమాలు

ఈ అభిప్రాయాలుగూడా చాలా దేశాలలో ఉండేవి. పవిత్రతను సంపాదించటానికి పురుషులు గూడా స్త్రీత్వం నటిస్తూ ఇతర పురుషులతో సంగమించటం.

కానన్నైట్ దేవాలయంలో ఇలాంటి పురుషులు స్త్రీలలాగ ఇతరులతో భోగిస్తూ పవిత్రతను సంపాదించి, పవిత్రు లవుతూ ఉంటారు అని వ్రాస్తారు.

ఇది ఆధారంగా చేసుకొని జీవితకాలం అంతా అలాగే ఉండిపోతారు కొందరు.

## మగవాళ్ళ పడుపు వృత్తి

మగవాళ్ళ పడుపువృత్తి, వీళ్ళు మగసానులు అందామా? ఇలాంటి వాళ్ళు చాలా దేశాలలో ఉన్నారు.

## బలసమర్పణం ఎలాగ ?

ఈ పురుష బల సమర్పణం చెయ్యడానికి వారిమార్గాలు చిత్రమైనవి. విషావస్తువులు తిని, పదేపదే స్త్రీ సంగమం చేసిచేసి నిర్వీర్యులై పోతారు. ఒక్క దినానికి అనేకసార్లు చొప్పున ఇలా చేయడంవల్ల కొన్ని రోజులలో ఈ మహాభక్తుడు పురుషత్వం లేనివాడై పోతాడు.

ఇంకొక రకం: స్త్రీ ఆవశ్యకత లేకుండానే, అవయవ పీడనం వల్లగూడా ఈ మహా ఫలితాన్ని పొంది పురుషత్వం మహార్పణం చేస్తారు. ఒక్క రోజుకి దాదాపు నలభై సార్లు అవయవపీడనం చేసి, సర్వశక్తులనీ సన్యసించిన మహాభక్తు లుండేవారు. అలా చేసినందువల్ల మరి ఎన్నడూ వాళ్ళు పురుషవ్యాపారానికి పనికిరాకుండా పోయేవాళ్లు. ఇలా వీర్యశక్తి మహార్పణ చేసినవారు దేశం అంతటికీ అగ్రగణ్యులు, పూజనీయులు. వీరికి ఇతర సంసార తాపత్రయాలు ఏమీ వుండవుగదా: ఎల్లప్పుడూ కోవెలలోనే వుంటారు. పవిత్రమైన జీవనం చేస్తూ వుంటారు. జ్ఞానం అభివృద్ధి చేసుకుంటూ వుంటారు. ఇతరులకి అవసరం అయినప్పుడు చెప్తుతుంటారు. పవిత్రతకీ, ధర్మానికీ, జ్ఞానానికీ వీళ్ళే పుట్టినిల్లు. ఈ నపుంసకులే ఆ రోజులలో అగ్రస్థానాలని అలంకరించినవాళ్ళు. అందరికీ గురువులు.

## వీళ్ళ పేరులు

ఇలాగ వాళ్ళ పుంసత్వం అంతా దేవతలకి ధారపోసి నిర్వీర్యులైన మహాభక్తులకి దేశ దేశాలలో పంటు, పంతు, పండ మొదలైన పేళ్ళున్నాయి. ఈ మాటలకి మొదటి అర్థం నపుంసకుడు అని అంటే పురుష శక్తి ధారపోసిన మహా భక్తుడని. అలాంటివాడు కాబట్టే ఈ పంతు, పంటు, పండ అనేవాళ్లు పూజనీయులై అందరికీ గురువులయ్యారు. దేవాలయాలలోని కార్యకాండ నడిపించే వాళ్ళయారు.

## వారే పండితు లయారు

వారే పండితు లయ్యారు. ఈ మాట వ్రాసినందుకు నన్ను తిటవి పండితు లుండరని నే నెరుగుదును. నేనుగూడా ఒకలాంటి పండితుడననే

అనుకుంటూ ఉండేవాడిని. అంచేత నాకీ అర్థం మొదట నచ్చలేదు. కాదని రుజావు చెయ్యడానికి చాలా శ్రమపడి ప్రయత్నించాను. ఇతర దేశాల సంగతీ చూచాను. మనదేశం సంగతీ చూచాను. పండితుడంటే వేరే అర్థం చెప్పదామని. నిఘంటువులు వెదికాను. ఆఖరికి చేతగాక నిజంగా పండితుడనే (నిర్వీర్యుడనే అర్థంలో) అయిపోయాను.

## కొంచెం చూదాం:

మనకు నపుంసకుడు అనడానికి ఉన్నమాటలు చూడండి.

"తృతీయా ప్రకృతి శ్శండః క్లీబః పండో నపుంసకం"–అమరం.

అని నపుంసకుడికి అయిదు పేర్లున్నాయి. అందులో మొదటిది స్త్రీకాక పురుషుడు కాక ఉన్నదని అర్థం. రెండవది శండ. మూడవది క్లీబః. నాల్గవది పండః. రెండవదానికి పాఠాంతరం ఒకటుంది. షండః అని. అందుచేత మనకి శండః షండః పండః అని మూడు రూపాలు దొరుకుతాయి. మొదటి అక్షరంలోనే మార్పు ఉంది. అందుచేతనే మొదటి అక్షరం ప, ఫ. యఫ్లాగ ఉండేదేమో అని అనుమానం. పండితులు ఆలోచించాలి. మన పండని చూడండి. పండ (పండా) అన్న పేరు నపుంసకుడికి ఉందని మన నిఘంటువు ఒప్పుతుంది. అంటే ఒకానొకప్పుడు ఆమాట వాడుకలో ఉందన్నమాట. అలాగే శండః, షండః అన్న మాటలు. ఎన్నో సంవత్సరాలయిపోయిన తరువాత ఈ మాటలకి వ్యుత్పత్తులు వ్రాయడానికి మొదలు పెట్టారు మనవాళ్ళు. నే నింతకుముందు చెప్పినట్లు తెలియనిచోట్ల తెలివి తేటలు చూపించారు. ఆ మాట జ్ఞాపకం ఉంచుకొని పీటికిచ్చిన వ్యుత్పత్తులు చూదాం.

"శ్యామతి ప్రజావిచ్ఛేదేన శండః"

అని చెప్పారు. అంటే ప్రజావిచ్ఛేదముచేత చల్లబడ్డవాడు అని అర్థం. ప్రజా అంటే సంతానం అనండి; మరేదయినా అనండి. దానిని కోసివేయడంచేత శాంతించినవాడు శండుడు. ఈ అర్థం దగ్గరదగ్గర అసలు నిజమైన అర్థానికి సంబంధం ఉన్నదే.

షండః అన్న మాటకి షణు దానే అన్న ధాతువును మనవాళ్ళు చక్కగా పట్టారు. దానినుంచి షండః అంటే దానం చేసినవాడు. అంటే మహాదానం అన్నమాట. ఈ అర్పణ చేసినవాడు అని చెప్పవచ్చును. కాని అసలు కిటుకు మరచిపోయారు కాబట్టి.

"సనోతి స్వస్యాపఖ్యాతి నివారణార్థం ఇతి షండః"

అని వ్రాశారు. అంటే తన అపఖ్యాతి పోగొట్టుకోడానికి ఇతరులకు దానాలు చేసేవాడు అని అర్థం చెప్పారు. ఇవి ఎంతవరకు నపుంసకులు చేస్తారో చూడండి. ధాతువుని మాత్రం విడిచిపెట్టకుండా ఇలా కల్పించారు. ఇకను పండాగతి చూడండి :

"పండతే లజ్జయా ప్రదేశాన్తరం గచ్ఛతి పండః" అని పడి గతౌ ధాతువుతో సాధించారు. సిగ్గుచేత దేశాంతరాలు వెళ్తాడు కాబట్టి పండ అన్నారట. ఈ అర్థం నపుంసకుడికి ఎంతవరకు పడుతుందో ఆలోచించవచ్చు బుద్ధిమంతులు. కాని ఈ మూడుమాటలు ఒక్క అర్థం ఇచ్చేవే. నపుంసకుడని. ఈ నపుంసకులే దేవాలయాలలో అగ్రగణ్యులు. మన దేశంలోగూడా పండాలు దేవాలయాలలో చాల ముఖ్యమైనవాళ్ళు. వాళ్ళకి ఆ పేరు చాల కాలంనుంచీ వచ్చినది పై కారణంవల్ల.

# మరి పండితుడో!

పండ శబ్దానికి, పండిత శబ్దానికి సంబంధం లేదనడం సాహసం. ఈ వషంనక పండాలు అలా కోవెలని కనిపెట్టుకొని ఉండిపోవడం వల్లా, మరేది పని లేకపోవడం వల్లా, అన్ని సంగతులూ వింటూ ఉండడం వల్లా, నలుగురితోనూ మాట్లాడుతూ ఉండడంవల్లా, త్వరలోనే చాలా సంగతులని తెలిసిన వాళ్ళయిపోతారు. ఆచారాలు నిర్ధారణ చెయ్యడానికి, సదుపదేశాలు చెప్పడానికీ ఈ పండా పెద్ద అయిపోతాడు. ఇంగ్లాండులో గూడా చదువూ, తెలివీ అంతా పూజార్ల (క్లెర్జీ) చేతులలోనే ఉండేది చాలకాలంవరకూ. అలాగే ఈ పండాలు జ్ఞానంలో పండితులవడంలో ఆశ్చర్యంలేదు. ఉండకూడదు. మాటలకూ శా సంబంధం గలవే. ఇకను మన నిఘంటుగా రేమి టంటారో చూద్దాం.

"ప్రాజ్ఞస్సంఖ్యావాన్ పండితః కవిః"

అని విద్వాంసుడి పేరులతో పండితః అన్న పేరు ఇచ్చారు ఇచ్చి వ్యుత్పత్తికి పూనుకున్నారు.

"పండతే జానాతి పండితః, పడి గతౌ"

అని పండాకి చెప్పిన ధాతువునే చెప్పి, పండతే అంటే తెలిసినవాడని పండితుడు అన్నారు. వాళ్ళకి అట్టే రుచించలేదు ఈ వ్యుత్పత్తి. అంచేత—

"పండా ధీరస్య సంజాతా వ పండితః"

అని మరొకమార్గం చూపించారు. పండా అంటే బుద్ధి అన్నారు. అది కలవాడు పండితుడన్నారు. పండ అంటే బుద్ధి అని ఎలాగ వచ్చిందో మరి చెప్పారుకారు. తెలియదు. ఎలాగయితేనేం, పండితశబ్దానికి పండాశబ్దానికి తెగని లంకె ఉందని ఒప్పుకున్నారు. పండా శబ్దానికి మన నిఘంటువులకు

తోడు ఇతర అనేక దేశాలు రుజావులున్నాయి నపుంసకుడని చెప్పడానికి. ఆ పండాలు ఎలాగ రానురాను జ్ఞానానికీ, బుద్ధికీ స్థానా లయిపోయారో చూచాం. అలాగ పండా అంటే జ్ఞాని, బుద్ధిమంతుడు అన్న అర్థం కలిగింది. పండత్వానికి (అంటే పాండిత్యానికి) మొదట వుండే కారణం ఆ నపుంసకత్వం. అది మరుపులో పడిపోయింది. ఆ కారణాన్ని విడిచిపెట్టుకున్నారు గూడాను ఇటీవల. కాని ఆ పేరు పండా అనీ, పండితుడని నిలిచిపోయింది జ్ఞాని, విద్వాంసుడు అన్న అర్థంలో. ఈ పండాల మూలపురుషులు మహా భక్తితో తమ పురుషత్వాల్ని దేవతలకి ధారపోసి నపుంసకు లయినవారన్న మాట మాత్రం మనం మరచిపోవద్దు. ఏ భాషలో నయినా మాటల చరిత్రను కొంచెం జాగ్రత్తగా చూస్తే చాలా ఆనందం కలుగుతుంది. అలాంటిదే ఈ పండా (పండిత) శబ్దం.

## పండాలే పూజ చేయటం

ఆ రోజులలో ఆ దేశాలలో ఈ పండాలే దేవతకి పూజా కైంకర్యాలు చేస్తూవుండేవాళ్ళు. తక్కినవాళ్ళు అంత పవిత్రంగా ఉంటారా మరి; కొన్నాళ్ళకి అంతలేసి భక్తులు దొరకడం తక్కువ అయిపోయింది. ప్రజలకి కూడా అభిప్రాయాలు మారుతూ వచ్చాయిగదా! వీర్య ప్రదానం చెయ్యనక్కరలేదు. నపుంసకు లయిపోనక్కరలేదు అన్న అభిప్రాయం కొన్నాళ్ళకి కలిగింది. అలాంటి భక్తులు రాకుండాపోయారు. కాని, పూజ, కైంకర్యంచెయ్యడం నపుంసకుడే చెయ్యాలన్న ఆచారం ఉందిగదా! ఎలా? అప్పుడేమి చేశారంటే, పూజారి మగవాడయినప్పటికీ పూజాదులు చేసేటప్పుడు చీర కట్టుకొని ఉండాలి అన్నారు. ఆరూపంగా పురుషత్వం లేదని కనబడితే చాలుననుకున్నారు. ఈ ఆచారం ఇప్పటికీ అక్కడక్కడ, మన హిందూ

దేశంలో గూడా అమలులో ఉంది. కొన్నిచోట్ల పూజారులు తాము పూజ చెయ్యవలసిన రోజులలో ఎటువంటి పురుష వ్యాపారమూ చెయ్యటానికి వీలుండదు.

కొన్నిచోట్ల పూజలన్నీ స్త్రీలే చెయ్యవలసి ఉంటుంది. అది స్త్రీ పూజారుల పద్ధతి, స్త్రీ దేవతల పూజగూడాను. అలా కాకుండా పురుష పూజారుల పద్ధతివి జరుగుతూ పురుష దేవతల పూజఅవుతూ ఉన్నప్పుడు పురుషుడు చీరకట్టుకోవడం, నపుంసకత్వం కనబరచటం ఎందుకు? అంటేత ఇది స్త్రీ పూజారుల ఆచారాన్ని అనుకరించడం అని అనరావనుకుంటాను. ఇది నపుంసక పండాల ఆచారాన్ని అనుకరించడమేగాని వేరే కాదు.

అలా ఆ ఆచారం నిలచిపోయింది. కాని ఆ మహా దానాలు, ఆ పురుషత్వ సమర్పణలు అంతరించిపోయాయి.

## మరొక మార్పు

సంతతం సంగమాలతో సర్వేశ్వరుణ్ని ఆరాధిస్తూ ఉండేవారు ప్రజలూ, దేవదాసీలూ, పండాలున్నూ. అలా జరుగుతూ ఉండగా కొంత మంది బుద్ధిమంతులు ఆలోచించి ఈ కార్యాలు సర్వకాలమూ చెయటం ఎందుకు? పంటలూ, పైరులూ, సంవత్సరానికొక్కసారి ఈ పూజా విధానం నలుపితే చాలదా? ఇష్టమున్నవాళ్ళు ఎల్లప్పుడూ అదే పనిగా చేస్తూ ఉన్నా, తక్కిన వాళ్ళు సంవత్సరానికొకసారి ఆరాధన చేయ కూడదా? అని తర్కించుకున్నారు ఇది గూడా కొంత న్యాయంగానే ఉంద నక తప్పదు. పంటదేవతలు సంవత్సరానికి బలహీన మయిపోతుంటాయి. వాళ్ళని తిరిగి బలపరచడానికి సంవత్సరానికొకసారి అందరూ ఆ బూతు

పూజలు చేస్తే చాలును అన్న అభిప్రాయం కొంత కాలానికి కొన్నిచోట్ల బలంగా కలిగింది.

## సంవత్సరాని కొకసారి :

అప్పటివాళ్ళకి ఈ ఊహ అనాచారంగానూ, పాపకార్యంగానూ కనబడేది. నిత్యకల్యాణపు పద్ధతి సంస్కరించడానికి చూచేవాళ్ళను మహా పాపుల్లాగ చూచేవాళ్ళు ఆ రోజుల్లోని ఆచారవంతులంతాను. వీళ్ళని బహిష్కరించి గూడా ఉండేవాళ్ళు. ఆ రోజులలో బహిష్కారాలూ, కోర్టు కాట్లూ ఉండి ఉంటే, ఆచార్యులవారికి, అప్పటి పండితులకి ఈ సంవత్సరాని కొకసారి మార్పు అంటే తల తీసేసినట్టు ఉండేది. కాని కాలం ఆచార్యుల చేతులలోనే ఉండేదికాదు. అది ఎప్పుడూ మారుతూ ఉండటమే దాని ధర్మం. మార్పు అనేది లేకపోతే అది కాలమే కాదు. అంచేత ఆ దినాల్లోని ఆచార్యులు, పండితులు తిట్టిపోసినా, శపించినా మార్పు రాక తప్పిందికాదు. వీళ్ళ అభిప్రాయాలు మార్పులను ఒప్పుకోవు. కాని మార్పులు మాత్రం రాకమానవు. మన దేశంలో చూడండి, కాలంవల్ల ఎన్ని మార్పులు కలుగుతున్నాయో ? ఇందులో దేనికి మన ఆచార్యులూ పండితులూ సరే అని ఒప్పుకున్నారు ? దేనికి వీళ్ళు అడ్డు తగలలేదు ? దేనిని వీళ్లు తిట్టలేదు ? క్రాపింగు కత్తిరించుకొనేసరికి గాండ్రుమనేవారు పెద్దపులులలాగ. ముక్కులో బులాకులు తీసినప్పటికి మూతులు విరిచేవారే. నల్లగాజులతోనే పోతుంది ముత్తైదువతనమంతా అనేవారే. దేనిని మన్నించారు? దేనిని సహించారు? కాని ఆచార్యులవారి అరుపులనీ లక్ష్యం చెయ్యలేదు. పండితుల శాపాలనీ ఖాతరు చెయ్యలేదు నాయనమ్మల దీవెనలనీ మన్నించలేదు. ఆ మార్పులు వచ్చితీరాయి. కాలప్రవాహం మార్పుతో

విజృంభించింది. ఈ ఆచార్యులనీ, గీచార్యులనీ చెత్తలాగ తోసుకొని పోయింది. వీరి సూత్రాలన్నీ ఎగిరిపోతాయి. అది నిజము. ఈ కాలప్రవాహంలో కాని ఆ రోజులలో మాత్రం అల్లరి తప్పదు.

## భార్యనిచ్చే ఆతిథ్యం:

ఆచారబలం ఎంతో ఒక్క నిదర్శనం చూడండి. ఇలాంటి నిదర్శనాలు మనకూ ఉన్నాయి. కాని, ఊరకే మనవాళ్ళకి కోపం తెప్పించడం ఎందుకని నేను ఇతర దేశాలకి పోతాను. మార్కోపోలో అన్న ఇటాలియను యాత్రికుడు చీనాలోనుండే అభ్యాసం ఒకటి వ్రాసిపెట్టాడు. ఇతడు కాకతీయ రుద్రమాంబను గురించి కూడా వ్రాశాడు. అతను వ్రాసినది సత్యం అని మనమందరము బుజా లెగర వేస్తాం .... చీనాలో ఎవరైనా అతిథుడు ఇంటికివస్తే, గృహస్థు అతనిని అన్నివిధాలా స్వగృహంలో ఉన్నట్టే చెయ్యాలి. ఎలాంటి లోపమూ కనబడనియ్యరాదు. సాక్షాత్తు భగవంతుడిలాగే చూడాలి. మనుష్యులకు కావలసిన కార్యాలు మూడు. ఆహారమూ, నిద్ర, సంగమమూ. కాబట్టి ఆ మూడింటిని అతనికి సమర్పించాలి. అప్పుడుగాని అతిథిపూజ సంపూర్ణమనిపించుకోదు. ఇలాంటివి వాళ్ళ ఉద్దేశాలు. అంచేత గృహస్థు ఏమిచేస్తాడంటే సంతృప్తికరంగా భోజనంపెట్టి, శయ్య చక్కగా సిద్ధంచేసి, తన భార్యని అతని పడకగదికి పంపుతాడు. అదీ ఆచారం. ఈ ఆచారం తప్పినవాడు అతిథిపూజకి తప్పినవాడయి మహాపాపి అవుతాడు. ఆ పాపానికి అప్పటి చీనావాళ్ళు ఓడికట్టలేకపోయారు. ఇలా జరుగుతూ వచ్చింది అతిథిపూజ ఆచారం.

# మానిపిస్తే, వచ్చిన ముప్పు:

ఒక చక్రవర్తికి ఈ ఆచారం అట్టే బాగుగా ఉన్నట్టు కనబడ లేదు. ఇతరులని చూస్తూ దీన్ని ఆమోదించలేకపోయాడు. ధైర్యం చేశాడు ఏమయినానరే అని కంకణం కట్టాడు. ఈ ఆచారం మానిపిస్తా నన్నాడు. భార్యనిచ్చే ఆతిథ్యం కూడదు అని ఆజ్ఞచేశాడు ఈ ఆజ్ఞను తప్పి నడిచినవారికి కఠినమైన దండనం అని ఉత్తరువు వేశాడు. ఏం చేస్తారు? ఆజ్ఞచేసినవాడు చిన్నవాడు కాడు. సాక్షాత్తు చక్రవర్తి. ప్రజలు తిట్టుకుంటూ ముక్కుకుంటూ, శపించుకుంటూ మానుకోవలసి వచ్చింది. ఆచార్యులు గుటకలు మింగవలసి వచ్చింది.

ఇలాగ మూడు సంవత్సరాలు ఈ అతిథిపూజ మానింది. అంత టిలో దేశములో పెద్ద కాటకం రేగింది. ఇంత అంత అని చెప్పరాని కరువు. కూలివాడిదగ్గరనుంచి చక్రవర్తిదాకా ఆ కరువుదాకకి గురిఅయి పోయారు. ఇదే సమయం అని లేచారు ఆచార్యులవాళ్ళంతాను. ఇదే సమయం అని బయలుదేరారు పండితులంతాను. ఈ కరువు అంతా చక్రవర్తిగారి ఆజ్ఞనుంచే కలిగింది అన్నారు. అతిథికి ఆ పూజ మాని నందువల్ల దేవతలకి కోపం వచ్చిందన్నారు. ఇంకా ఏమేమో అన్నారు. ఆ ఆజ్ఞ తక్షణం రద్దుచెయ్యకపోతే దేశ మంతా దగ్ధమయిపోతుందన్నారు. ప్రజల్లో ఉద్రేకం పుట్టించేశారు. ఏదో మహా విప్లవం కలుగుతుందిరా అన్న భయం కలిగించారు. ఇంక చక్రవర్తి ఏమి చేయగలడు? నెమ్మ దిగా తన ఆజ్ఞను తానే రద్దుచేశాడు. అతిథి పూజకు భార్యలని ఎప్పటి లాగే పంపుతూ ఉండవలసింది అని క్రొత్త ఆజ్ఞ చెలామణీ చేశాడు.

అలా ఉంటుంది ఆచారాల బలం.సంసాల ప్రభావం. కాబట్టి బూతు పూజలు ప్రతిదినమూ ఉండనక్కరలేదు. అనేటప్పటికి ఎంత అలజడి కలిగి వుంటుందో ఆలోచించండి.

## పంట పూజలు:

అయినా నేను చెప్పినట్టు మార్పు కలిగింది. సంవత్సరానికి ఒక్క సారి అన్నారు. పంటదేవతల ప్రీత్యర్థ్యం సంవత్సరానికి ఒక్కసారి మహారాధన చెయ్యాలన్నారు. ఆ వేళ అందరూ వ్యభిచరించాలన్నారు. లేకపోతే పాపం. అది ఒక పెద్ద ఉత్సవంగా పరిణమించింది.ఈపూజలు ఒక్కొక్క చోట ముప్పయి రోజులుగూడా సాగుతూ ఉండేవి. కొన్నిచోట్లమహామాత అన్న పేరుతో పూజం ఉత్సవాలు చేసేవారు. 'ఉప్పులేరో','ఉప్పునూసా' అనే పేరుతో చేసేవారు ఈ సంభోగ పూజలు. ఇలా అనేకచోట్ల అనేక విధాలుగా ఈ బూతు ఉత్సవాలు చేస్తూ ఉండేవారు. కాని అంతటా ఆ మహాభక్తుల హృదయాలలో ఉండే అభిప్రాయం ఏమిటి? సంవత్సరం పొడుగునా పంటలు పండించి దేవతలు బలహీను లయిపోయారు. వారికి బలం కలిగించాలి. కాబట్టి అందరు భక్తులు ఆ సంగమశక్తిని అర్పణ చెయ్యాలి. అందరూ మహాలింగ ప్రీతి చెయ్యాలి. రాత్రి అంతా నిద్ర అన్నది లేకుండా ఈ మహాబూతు నడపాలి. ఊరికి క్షేమం. శివం కలిగించాలి అనేగాని మరొక్కటి కాదు. ఈ పని చెయ్యనివారు పాపులూ, దేశ ద్రోహులూ అని ఈ పూజలు మహోత్సాహంతో మహావిష్ఠతో మహావైభవంగా చేస్తూ ఉండేవారు. పవిత్రమైన భావాలతో తమ భక్తిని వెల్లడిస్తూ ఒళ్ళు దాచుకోకుండా స్త్రీ పురుష లందరూ ఉత్సాహంతో ఉత్సవాలు చేస్తూనే ఉండేవారు.



ఇప్పటికీ కొన్ని దేశాంలోనూ మన దేశంలోనూ గూడా ఈ ఆచారాలు కనబడుతూనే ఉన్నాయి. ఆ పనులు జరుగుతూనే ఉన్నాయి. కాని వాటి అర్థం మనము మరచిపోయాము. ఆ దేశాలవాళ్ళు మరచిపోలేదు. అంతే భేదం మరేమైనా ఉందా అంటే, వాళ్ళు నిజం నిజంగా చెప్పుతారు. మనవాళ్ళు మసిపూసి మారేడుకాయ చేసి విపరీతమైన గూఢార్థం విప్పి చెప్పుతారు, తెలివైన వాళ్ళవడంచేత అంతేగాని మరేదీలేదు.

## ఇంటింటికీ వెళ్ళి ఈ పనే చేస్తారు

ఈ ఉత్సవాలు చాలా చిత్రంగా ఉంటాయి. మూలసూత్రం జ్ఞాపకం ఉంటే మరేమీ బాధ ఉండదు, బోధపడడానికి. గ్రీసుదేశంలో ఈ ఉత్సవం వచ్చేసరికి ప్రతివాడు, ప్రతి ఆడది ఆ బూతు వేషంలో విహారం చేస్తూ ఉంటారు. అంతటితో వాళ్ళకి సంతృప్తి కలగదు. ప్రతి ఇంటికీ శుభంకల గాలి. ప్రతి ఇంటికీ లక్ష్మిరావాలికదా. అందుకోసం ప్రతి ఇంటిముంగిటా కొంత గడ్డి చక్కగా పరుపులాగ పరిచి ఉంచుతారు. ఉత్సవం రేగుతూ ఉంటుంది. ఈ భక్తులతో మహా భక్తులు ఉంటారా మరి ? వాళ్ళు సాధారణంగానే ఉంటారా ? ఉండరు. చక్కగా వేషాలు వేసుకొని జంటలు జంటలుగా బయలుదేరుతారు. స్త్రీలూ, పురుషులూ. ఈ ఇంటికి వస్తారు. అక్కడ పరచి ఉన్న గడ్డి పరుపుమీద సంగమ కార్యం చేస్తారు. కామశాస్త్రంలో వాళ్ళకున్న చాకచక్యం అంత కనపరుస్తారు. ప్రజలంతా ఉత్సాహంతో చూస్తుంటారు. వాళ్ళ భక్తికి మెచ్చుకొంటుంటారు. ధన్యవాదాలు చేస్తూ ఉంటారు. అక్కడ అయిన తరువాత మరొక ఇంటి దగ్గరికి వెళ్ళుతారు. అక్కడ మళ్ళా ఇలాగే ముంగిట గడ్డి పరుపుమీద తమ భక్తిని కనబరుస్తారు. దేవపూజ చేస్తారు. ఆ గృహానికి లక్ష్మీ ప్రసాదం కలిగిస్తారు.

## బూతుకు తోడు తిట్లు :

బూతు పనికి అంటే శరీరాలు అలసిపోవచ్చును. అనుకున్నంత పూజ జరపలేకపోవచ్చును. మరెలాగ భక్తి చూపించడం ? ఉంది కదా అలయిక, సొలయిక లేకుండా వుండే ఒక అవయవం – నాలుక; దాన్ని ఉపయోగిస్తారు. బండ బూతుమాట లన్నీ ఆడుతుంటారు. సంగమాలని వర్ణిస్తారు. వాటిలో గాడిదెలనే, గుర్రాలనీ పాత్రలుగా పెడతారు. స్త్రీ పురుష అవయవాలని వర్ణిస్తారు. అతిశయోక్తులు కురిపిస్తారు. మాటలలో పనులలో చూపలేని భక్తి అంతా పలుకులలో చూపించి ధన్యులవుతూ వుంటారు.

## బూతు పిండివంటలు :

పిండివంటలు చేసుకొన్నా, ఈ బూతుబుద్ధి తప్పదు. స్త్రీ అవయవాలలాగా, పురుష అవయవాలలాగా, పిండివంటలూ, మిఠాయిలూ తయారుచేసుకుంటారు వాళ్ళలో వాళ్ళు పంచుకుంటారు. దేవతలకి సమర్పిస్తారు. తింటారు. (*) అలా పంచినందువల్లా, దేవతకు సమర్పించినందువల్లా ఆ స్త్రీల అవయవాలను అంటిపెట్టుకొని ఉండే దోషాలు తొలగిపోతాయని వారి నమ్మకము. ఆ అవయవాలను ఆశ్రయించి ఉన్న గాలి (దయ్యము) పారిపోతుందని వారి విశ్వాసము. ఇప్పటికీ మనలో ఆడపిల్లలు సమర్త అయినప్పుడు 'చిమ్మిలి' దంచి స్త్రీ దేవయవాల రూపంగా చేసి "అవయవ దోషపరిహారార్థం" ఇతరులకు పంచి పెట్టడం ఆచారం.

---

(*) చిమ్మిలిని గురించీ, ఈ ఆచారాన్ని గురించీ ఎక్కువ తెలుసుకోవాలంటే "సమర్త అంటే ఏమిటి ? చిమ్మిలి ఎందుకు పంచుతారు ?" అనిన నా వ్యాసం చూడవచ్చు.

ఇలాగ ఆ ఉత్సవాలలో తినేది, వినేది, కనేది అంతా బూతు, బూతుశక్తి విశ్వరూపంతో తాండవిస్తూ ఉంటుంది. లక్ష్మితో కలకల లాడుతూ ఉంటుంది ఊరు.

## మనలోనో :

ఇది ఒక ఉదాహరణంగా ఇచ్చాను. ఇలాంటివి మరి ఒకటి రెండు ఇస్తాను. కాని ఇందులో ఎంత మనదేశానికి వర్తిస్తుందో ఒక్కసారి చూడండి. నేను ప్రత్యేకంగా మన దేశాన్ని గురించి వ్రాయవలసింది ఇంకా ఉంది, కాని విశ్వాసం కలగడానికి కొంచెం చూదాం, మన ఉత్స వాలలో పిండివంటలు చూడండి; బూరెలూ, గారెలూ, సుగియలూ, పాల కాయలూ, మొదలైనవన్నీ ఆ ఆకారాలలాగే ఉండడం ఎందుకు ? ఆలో చించండి. పాలకాయరూపంగా చేసినందువల్ల ఆ పిండికిగాని, ఆ భక్ష్యానికి గాని కలిగిన రుచి ఏమయినా ఉందా ? గారెలకి మధ్యను వేలితో పొడ వక పోతే రుచిగాని, వేగడంగాని తక్కువ అవుతుందా ? లోపం పూర్ణం పెట్టి పైపొరతో ఉండలలాగే చేయడం ఎందుకు ? మరొక రూపంగా చెయ్యలేరూ ? అలా మరొక రూపంగా చేస్తే వివాహాది ఉత్సవాలలో ఆచా రాలు హర్షిస్తాయా ? లేదు. మన పిండివంటలు గూడా అలాంటివే. అది మన తత్వంలో జీర్ణించి ఉంది.

ఒక్క పిండివంటలలోనే కాదు దేవతార్చనలోనూ, దేవతాపూజల లోను ఉపయోగించే పాత్రలుగూడా అలాంటివే; దీపారాధనకు అవసర మయిన పరికరాలు గూడా ఆ ఆకారాలలోనే ఉండేవి. మట్టితోనో, ఇత్తడి

తోనో తయారు చేసిన దీపపుబొమ్మలూ, కుందులూ, స్త్రీ పురుష గోప్యాంగాలను పోలిఉంటాయి. ఒక్కొక్క దీపపు బొమ్మ సరిగా పురుషాకారముతో, అత్యంతం పొడుగయిన అంగముతో, ప్రమిదను పట్టుకొనినట్లుంటుంది. ఈ బొమ్మ తయారుచేయడంలో ఆ శిల్పి తన పనితనమునంతటినీ ప్రదర్శిస్తాడు. ఆ రూపంగా తన దైవభక్తి చూపిస్తాడు.

దేవతార్చనకు ఉపయోగపడే పంచపాత్రలూ, ఉద్ధరణులూ, ఇలాంటి పరికరాలు చాలవరకు గోప్యాంగాల అతిశయోక్తులతో నుండేవి. వ్రాతకోసము అవసరమయిన సిరాబుడ్లు ఈ ఆకారాలతోనే-చిత్ర విచిత్రంగా-తయారుచేసి, వాడుకొనేవారు. ఇలాటి పూజా పరికరాలు అనేకము-చాల చక్కని శిల్పితనముతో నుండేవి-ప్రాక్ పశ్చిమ దేశాలలో ముఖ్యనగరాలలోని మ్యూజియములలో ఇప్పటికిని చూడవచ్చును. గాలి(దయ్యము)సోకకుండా చేతులకో, మెడకో, మెడలోనో కట్టుకొనే రక్షలుగూడా అనేకం ఈ ఆకారంలోనే ఉండేవి. రెండవ ప్రపంచయుద్ధకాలములో-ప్రపంచాన్నంతటినీ, కొన్ని మాసాలు అల్లలలాడించిన డిక్టేటరు ఇటలీలోని ముస్సోలినీ ఈలాంటి రక్షనొకదానిని తన ముంజేతికి కట్టుకొని ఉన్నట్టు స్వయంగా చూచినవారు సాక్ష్యమిస్తున్నారు. గోప్యాంగాలను ఈ విధంగా అనుకరించడం ఆ దినాలలో సర్వవ్యాప్తిగా ఉండేదనడానికి ఇంక సందేహముంటుందా ?

## మంగళ సూత్రాలూ ఆ చిహ్నాలే!

చూడండి మన మంగళసూత్రాల ఆకారాలు, మొదటి రూపం, రావి ఆకులాగ ఉన్న రేకు మధ్యను పొడుచుకుంటూవచ్చే ఒకమొన, రావిఆకు ఉపమానమూ మధ్యనుండే ఆ మొనా స్త్రీ పురుష భాగాలనే విరూపిస్తాయి. తరువాత రావాకు ఆకారం మానుకుని గుండ్రని ఆకారం చేశారు.

కావి మధ్యనుండే ఎత్తువి మాత్రం మానలేదు. అదే సంగమ చిహ్నం. అదే లింగమూ, పానవట్టమూ. అదే దైవం ఆ రోజులలో. తెల్లవారు జామున లేచినా సాయంత్రం దీపం పెట్టినా దానినే మన వాళ్ళందరూ కళ్ళకద్దుకుంటూ తమ పాతివ్రత్యాన్ని నిలుపుకుంటారు. ఆ మంగళసూత్ర మహిమ సాక్షాత్తు దైవమహిమే కదా. చెప్పరావడం ఏమిటంటే బూతు పూజా, ఈ అవయవ ఆరాధన మానవుల హృదయాల్లో సంపూర్ణంగా జీర్ణించాయి. అంచేత మన పిండివంటలు రూపాలుకూడా అవేకాని వేరు కాదు. మనం అర్థం మరచిపోయాం.

## మన లో తిట్లు :

మన ఉత్సవాలలో తిట్లుగూడా ఉన్నాయి. ప్రతిచోటా—గ్రామదేవతల ఉత్సవాలలో వేషాలూ వాళ్ళ మాటలూ చూడండి. బూతు పూర్తిగా కనిపిస్తుంది. ఒకడు ఒక రోలుని నడుముకు కట్టుకొని రోకటితోదంచుతూ అరిచిన అరుపులకి మరి ఎక్కడైనా అర్థముంటుందా ? రంకులరాటం దగ్గర మహా ఆవేశంతో స్త్రీపురుషులు కూసే కూతలకి ఈ దినాలలో ఏమి వ్యాఖ్యానం చేస్తాము ? ఇవన్నీ ఎవ్వరో చేసినవి కావు. అనాది నుండి వస్తున్న ఆచారాలు. ఇప్పుడు మన కంటికి అనాచారాలు లాగ కనబడు తున్నాయి. దోషమే అయితే మానిపించరేమి ? ఆచారబలం ఉంది. అది మానదు—ఇంత వేగం, తాతల నాటినుంచి వస్తుంది. అంతేగాని కుర్రకుంకలు చేసిన తప్పుడు పనికాదు. పవిత్రం అయిన ఆచారం అప్పుడు కాకపోతే అప్పుడే ఎప్పుడో ఆపివేసి ఉందురు.

## 57

## జగన్నాథంలోని తిట్లు :

పోనీ ఇవన్నీ క్షుద్రపూజ లందాం—మాటవాసికే సుమండీ—ఎంచేతనంటే అవి క్షుద్రపూజలు కావు. పూజలకి మూలాధారాలు—జగన్నాథంలో చూడండి. వస్తూ వస్తూ రథం ఆగిపోతుంది. ఇకను చెలరేగుతాయి తిట్లు. ఆ సమయంలో తిట్టనివాడు పాపాత్ముడే అని అనుకునేవారు. కొన్నాళ్ళు. ఆ సమయంలో తిట్టని బండతిట్టు ఉండదు. ఆ మహా పుణ్యకాలంలో నోటితో రంకుపోవని మనుషు లుండరు స్త్రీలుకాని పురుషులుకాని, ఆహా ! ఏమి తిట్లు ! ఎంత కవిత్వము అందులో ! భాష తెలిసినవాళ్ళదే భాగ్యం ! ఈ తిట్లు ఎందుకు ? వేరే అర్థాలు మనకువద్దు. బూతుతిట్లుగూడా ఒకరకం పూజలే అనిపించుకొనేవి. భూమీ ఆకాశం అంతా బూతుతో నిండిపోయి వుండాలి ఉత్సవం అంటే. ఇలాగ తినడానికి, వినడానికి మనలో కూడా బూతు కనిపిస్తూనే వుంది. ఇకను కనడానికి బూతు వుందా అంటారు. దీనికి నా జవాబు—ఓ ! ఉంది; లక్ష.

## మనలో బూతు:

ఉత్సవాలలో ఉండేదంతా బూతే అని మనవి చేశాను. తిన్నదీ, విన్నదీ, కన్నదీ బూతే అని నిరూపించాను. మన దేశంలో గూడా తినడానికి వినడానికి కావలసినంత బూతు వుంది అని చూపించాను. ఆదిసూత్రాలు మనం మరచిపోయినా, ఆచారాలూ ఆకారాలూ ఆ మాటలనే సార్థకం చేస్తున్నాయి. ఇకను కనడానికి మన దేశంలో దృష్టాంతా లున్నాయా అని ప్రశ్నించుకున్నాం.

## చూస్తూ ఉండగానే వా:

అందరూ చూస్తూ ఉండగా, బహిరంగంగా బూతుపనులు చేస్తారు. అంటే "శ్రీహరి" అని చెవులు మూసుకుంటారు. అనాగరిక జాతుల వాళ్ళని ఆడిపోస్తారు. అబద్ధం అని కొట్టివేస్తారు. అసహ్యం అని ఏవగించుకుంటారు. మనకలాగ లేదు పోనీ మహాప్రభో అని సంతోషిస్తారు. ఎన్ని అగచాట్లయినా పడతారు మనవాళ్ళు.

కాని విజాన్ని కప్పిపుచ్చడం ఎలాగ? దేశదేశాలలో మహా వ్యాప్తిలో ఉన్న సంగతిని కాదనడం ఎలాగ? మనలో ఇంకా నిలిచి వున్న ఆచారాలకి అర్థం చెప్పడం ఎలాగ? ప్రపంచం అంతా కోడయి కూస్తూ ఉంటే నిరాకరించడానికి బలం ఎక్కడనుంచి వస్తుంది? వాళ్ళంతా చేస్తున్న పనులే మనమూ చేస్తున్నాం. మరి వాళ్ళు ఒప్పుకున్న సంగతి మనం ఎందుకు ఒప్పుకోకూడదు? ఈ రోజులలో బూతువని అంటే పెద్దవాళ్ళంతా బొమలు చిట్లిస్తారు. ముక్కుమీద వేలు పెట్టుకుంటారు. అనాచారం అంటారు. పాపం అంటారు. కాని ఎల్లప్పుడూ ఇలాగే ఉందేదా కాలం? ఆ రోజుల్లో బూతు పాపంకాదు సరేకదా, అది పవిత్రమైన పూజ. పావనమైన కార్యం. అద్వితీయమైన ఆరాధన అని కదా మనవి చేశాను. ఈనాటి దృష్టితో ఆనాటి అభిప్రాయాలని విమర్శించడం అన్యాయం. ఇంగ్లీషువాళ్ల దృష్టితో మన "గోమయ ప్రభావం" విమర్శిస్తే మన గతి ఏమిగాను?

"ఆవు పేడా మీరు హర్కీకుంతార్
ఆవు హూతి మీరు తాగీకుంతార్
ఆవు ఎక్వా మీలో మస్పీ తక్వా
హబ్బెబ్బె హబ్బెబ్బె; ఏమీ మతం."

అన్నట్టేకదా అవుతుంది? ఆ విమర్శన మనకంత ఇంపుగా ఉంటుందా? కాబట్టి మనరోజుల కొలబద్దలతో ఆ రోజుల సంగతులు కొలవకూడదు. ఉన్నది ఉన్నట్టే మనం గ్రహించాలి. ప్రపంచం అంతా పరకాయించి చూడండి, ఎలాగుంటుందో!

## దేవతలకు పెళ్ళి:

ఉపులేకో అనే పురుషదేవతకీ, ఉపునూసా అనే స్త్రీ దేవతకీ కొత్తపంట కాలంలో వివాహం చేస్తారు—సూర్యదేవతకీ భూదేవత

అనంది. సూర్యదేవత మగ విగ్రహం. అదే వాళ్ళకి కొత్త సంవత్సరం. ఈ ఉత్సవం ఒక నెల రోజులు సాగుతుంది. ఇది మన రావిచెట్టులాంటి ఒక చెట్టుకింద జరుగుతుంది. ఆ చెట్టుపేరు "నూనూ" అంటారు. ఈ ముప్పయి రోజులు ఆ ప్రజలకు విధీ విరామమూ ఉండవు. మగవాళ్ళూ ఆడవాళ్లూ తోపులాటలతో, కుస్తీపట్టులతో, పందేలతో సాటిలేని విధంగా స్వేచ్ఛావిహారం చేస్తారు. రావపిల్లని రైతుపట్టినా, కాపుపిల్లని కామందు పట్టినా తప్పులేదు. ఆ వేడుకలకి అంతంలేదు. ఆ వ్యభిచారానికి హద్దు లేదు.

## పొలం పూజ:

జావా ద్వీపంలో పంట కాలంలో ఒక పద్ధతి జరిపేవారు. పొలం గల మనిషీ తన భార్యా దిగంబరులయి పొలానికి పోతారు. వాళ్ల పొలం చుట్టూ ప్రదక్షిణ చేస్తారు భక్తి వినయాలతో. కొందరు అంతకుముందు మూడు రోజులు ఉపవాసదీక్షతో గూడా ఉంటారు. అలా ప్రదక్షిణచేసి పొలం మధ్యను భార్యా భర్తలు సంగమిస్తారు. ఈ కార్యక్రమంవల్ల పంటలు బాగా పండుతాయని వాళ్ల నమ్మకం.

## చెట్టుతో సంగమం:

మధ్య అమెరికాలో గూడా ఇలాగే చాలా నిష్ఠతో ఉపవాసం ఉంది పొలం యజమాని తన భార్యతో పొలం మధ్యను కూడతాడు. లేదా అక్కడ ఒక చెట్టుతో రమిస్తాడు.

ఇది మనకుగూడా కొత్తకాదు. మన అశ్వత్థప్రదక్షిణాలకు అర్థం ఏమిటి? సంతానం కావలసిన స్త్రీ రావిచెట్టు చుట్టూ మహా నిష్ఠతో తిరిగి చెట్టుని ఆలింగనం చేసుకుంటుంది. ఆ చెట్టులో శ్రీ అశ్వత్థనారాయణు

ఉన్నారు. ఆ ఆలింగనం వల్ల ఈ స్త్రీకి సంతాన ప్రాప్తి కలుగుతుంది. ఇందులో చెట్టు పురుష భాగం అయింది ; అమెరికాలో చెట్టు స్త్రీ భాగం అయింది. అంతే వ్యత్యాసం. మరేదీలేదు. మధ్య అమెరికా వాళ్ళని మనం నిందించ నక్కరలేదు. అందరమూ ఒక్క బసిలోనుంచి వచ్చిన వాళ్ళమే.

## మహాలింగ ధ్వజ ఉత్సవం :

బర్సర దీవులలో ఈ పంట ఉత్సవం మరొక చిత్రంగా ఉంటుంది. గ్రామంలో ఉన్న స్త్రీ పురుషు లందరూ ఒక బయలులో జమ అవుతారు. అక్కడ ఒక పెద్ద జండా ఎగర వేస్తారు. ఆ జండా గుడ దగ్గర దగ్గర అయిదు అడుగుల వెడల్పు ఉంటుంది. ఆ జండా మీద ఒక మనిషి విగ్రహం ఉంటుంది. ఆ మనిషి అత్యధికమైన పురుష అవయవాన్ని తగి లిస్తారు. ఈ స్త్రీ పురుషు లందరూ ఆ జండానే మహాలింగంగా భావించి మహాభక్తితో పూజ చెయ్యటానికి కారంభిస్తారు. ఆ జండా గాలి ఆడుతూ ఉన్న కొద్దీ, కిందను సమావేశమైన వాళ్ళకి ఉద్రేకం ఎక్కువ అవుతూ ఉంటుంది. మనోవాక్కాయంతో లింగతర్పణ చేస్తూ ఉంటారు. అవి ఊహలు కావు, అవి తిట్లు కావు, అవి సంభోగాలు కావు. నీదీ నాదీ అన్న విచక్షణ లేదు. కాలమూ స్థలమూ అన్న చింత లేదు. ఎవరైనాసరే, ఎక్కడైనాసరే, ఎప్పుడైనాసరే, మహా లింగపూజ జరగవలసిందే. క్రింద జరుగుతూ ఉన్న విలాసమూ ఉత్సాహమూ అంతా, ఆ మీద ఎగురుతూ ఉన్న మహాలింగానికి అర్పణ అవుతుంది. దానికి అధికమైన బలం కలుగుతుంది. పంటలు పండి ప్రజలందరూ సుఖిస్తారు. దేవతాప్రీతి, దేశప్రీతి రెండూ అవుతాయి.

## పి డి మా ను తం తు :

ఏమిటా ఇంత ఆగడం అనుకుంటాం. అసహ్యించుకుంటాం గూడాను. కాని కొంచెం ఆగండి. మన దేశంలో కొన్ని ఉత్సవాలలో ఇప్ప

టికి 'సిడిమాను' అన్నది ఒకటి ఉంది. బాగా పదిహేను అడుగులు ఇరవై అడుగులు పొడుగున్న ఒక తిన్నని చెట్టు తెస్తారు. ఆ చెట్టుకి వంకరలూ టింకరలూ ఉండకూడదు, నిట్టగా ఉండాలి. దానిని రెండు చిన్నకొయ్యల మధ్యనుపెట్టి ఒక బండిమీద ఎక్కిస్తారు. చుట్టూతిప్పడానికి వీలుగా చేస్తారు. ఇదే మహాలింగం. ప్రజ అందరూ దానికి పూజలు చేస్తారు. ఈ రోజులలో గూడా ప్రజలలో తిట్లు తగ్గలేదు. ఆచారరూపంగా కాకపోయినా అభ్యాస రూపంగా నయినా స్త్రీ పురుష సంఘర్షణ చాలా ఉంటుంది, నాగరికతరోజు లయినప్పటికీ, ఆ మహాలింగానికి బలి ఇవ్వడము గూడా వుండేదట కొన్నాళ్ళు. అసలు సూత్రాలు కొంచెం మరచిపోయినా ఆచారం మాత్రం ఇంకా మనలోనూ వుంది.

## మంత్ర పూతమైన సంభోగం:

ఉత్తర అమెరికాలో కొన్ని జాతుల వాళ్ళున్నారు. వాళ్ళలో ఒక గొప్ప ఆచారం వుంది. అది మహా పుణ్యాత్ములు చేస్తారు. అది చేసిన వాళ్ళని పావనమూర్తులు, మహాత్ములు అని గౌరవిస్తారు. ఆ ఆచారానికి మూలసూత్రం మనకు తెలిసినదే.పాత దేవుడు బలహీనుడై పోతాడు.అతని పనిని కొత్త దేవుడు తీసుకుంటాడు. సంతాన కార్యం చక్కగా నడుపు తుంటాడు. పంటలు బాగుంటాయి. ఇదే సూత్రం.

## దీవికార్యక్రమం:

గృహస్థు ఒకడుంటాడు చాలాపుణ్యాత్ముడున్నూ.సనాతనుడున్నూ. అతను అతనిలాంటి పవిత్రుడినే మరొకడ్ని ఎంచుకుంటాడు బదిలీగా. వీళ్ళే పాతదేవుడూ, కొత్తదేవుడూ అనుకోవచ్చును. ఈ గృహస్థు ఒక పెద్ద వుత్సవం ఆరంభిస్తాడు. అంతా చాలా ఆచారంగా జరుగుతూ

ఉంటుంది. ఆ ఉత్సవం మహానిష్ఠతో అతని ఇంటికి ఆ బదిలీని తీసికొని వస్తారు. ఈ గృహస్థు భార్య తన ఇంటిలోనుంచి బయలుదేరుతుంది. మేళాలు తాళాలు ఉంటాయి. ప్రజలంతా ఆశీర్వదిస్తుంటారు. మహా ఉత్సాహంగా ఉంటుంది. అంత ఆడంబరంతో భార్య ఈ బదిలీ మనిషి దగ్గరకి వస్తుంది. ఆయన చాల నిష్ఠతో స్వాగతం ఇవ్వడానికి సిద్ధంగా ఉంటాడు. ప్రజలు చుట్టూ కిక్కిరిసిపోయి ఉంటారు. ఒకరినొకరు తోసుకుంటూను. ఆ దొమ్మీలో నలిగిపోతూఉన్న ఆడవాళ్ల అరుపులుగాని, పిల్లల ఏడ్పులు గాని ఎవరూ లక్ష్యం చెయ్యరు. అందరూ తదేక దీక్షతో అక్కడ జరుగుతున్న తంతు అంతా చూస్తూ ఉంటారు

ఇలాగ ఇంత వైభవంతో వస్తుంది ఆ గృహస్థు భార్య. మహా భక్తిపూర్వకంగా బదిలీ మనిషి దగ్గరికి వెళుతుంది. వెళ్ళి వినయంగా తాను కట్టుకొని ఉన్న చీర జారవిడిచేస్తుంది. దిగమొలతో ఆ గృహిణి వెల్లకిల పడుకుంటుంది అక్కడ. ఆ తరువాత, ఈ బదిలీమనిషి మహా భక్తితో, ఈశ్వరార్పణం అంటూ ఆ గృహిణితో కూడుతాడు. పురోహితుడు శాస్త్రోక్తంగా "మహాకైంకర్యం అయింది" అని అందరికీ తెలియజేస్తాడు. ఆ తరువాత ఆ యిల్లాలు తిరిగివచ్చి "వేదవిహితమైన కార్యాన్ని సక్రమంగా ఆచరించి తిరిగివచ్చాను" అని ప్రకటిస్తుంది. జనులు ధన్యవాదాలు చేస్తారు. ఆగృహస్థు ఒక సోమయాజిలాగ గౌరవం పొందుతాడు. స్వర్గానికి సరిసరిగా పోవగలిగినంత పుణ్యం సంపాదించాడు. ఊరి వాళ్ళంతా ఉబ్బిపోతారు. కొత్తదేవుడికి కావలసిన బలం కలుగుంది పంటలు బాగా పండుతాయి.

# ఏమిటీ అనాచారం?

ఏమిటీ అనాచారం అంటారు మన పట్టుబట్టల వాళ్ళున్నూ, విష్ణునీమాల వాళ్లున్నూ. వ్యభిచారం అంటే ఊరుకుందాం అనుకున్నా మంత్రాలని గూడా ఈడుస్తున్నాదేమిటి అని ఆగ్రహిస్తారు. బహిరంగ సంగమాలకి మంత్రాలుకూడా ఏమి వచ్చాయి అని అసహ్యించుకుంటారు. ఇంగ్లీషు చదువులు ఇలాగ చేశాయి అంటారు. పాపం పెరిగిపోతుంది అంటారు. ఈ దుర్మార్గులతో నోటికి నోయ కలపడం మంచిదికాదని మౌనం వహించడమే మంచిదని అనుకుంటారు. ఎందుకో ఇంత ప్రయాసం!

## మనలో లేదా :

నలుగురూ చూస్తూ ఉండగా సంగమం చెయ్యడం మనకు కొత్తదా? అలాంటి దానికి మంత్రాలు తోడు చెయ్యడం మనకి వింత సంగతా? అలాంటి పనిచేసేవాళ్లని గౌరవించడం మనకి ఎప్పుడూ లేనిదా? అలాంటి పని చేసిన వాళ్ళనిచూచి ఊరువాళ్లూ, వాడవాళ్ళూ ఉబ్బిపోవడం మనకి

మాతనమా? ఎందుకు మనం లబలబ నోరు కొట్టుకోవాలి? ఇవంతా మనకు చిరకాల పరిచయమే కదా! ఇప్పుడు కూడ మనలో వున్నదే కదా!

## పౌండరీకం ఏమిటి ?

మనకు అనేక విధాల యజ్ఞాలున్నాయి. అవి వేదవిహితాలు. చాల పవిత్రమైనవి. చాల పురాతనమైనవి. యజ్ఞం చేసినవాళ్లు అంతా మహా పావనులున్నూ- గొప్పవాళ్ళున్నూ, ధన్యాత్ములున్నూ. అన్నీ మంత్రాల తోనూ, గొప్ప తంతులతోనూ జరగవలసినదే. దీక్షకి విష్ఠకి మరి చెప్ప వలసింది ఉండదు. అందులో ఒక యజ్ఞం వుంది.'పౌండరీకం' అని. ఇది చేసినవాళ్లు కట్టెతో కైలాసానికి పోతారు. పరలోకంలో రంభా సంభోగం కలుగుతుంది వాళ్ళకి. అంటే వాళ్ళంతా సాక్షాత్తు దేవతలే అయిపోతారు. లేకపోతే రంభా సంభోగం ఎలాగ కలుగుతుంది? పౌండరీకం చేసిన వారంటే పరమపావను డన్నమాట! ఎంత గొప్ప! ఎంత గౌరవం!

అదేమిటో? కొంచెం చూడండి. ఇది పాపం కాదు, అపవిత్రం కాదు. దోషంకాదు. చాల ఉత్తమం. మహా పవిత్రం.

## చే సే దే మి టి?

అదేమి దీక్ష? అదేమి విష్ఠ! ఎంతమంది బ్రాహ్మణులు! వేద పారంగతులు. శ్రుతి స్మృతి పురాణవేత్తలు, షడ్దర్శనాలు చదువుకున్న వాళ్ళు వేదాంగవేత్తలు, ఘనాపాఠులు అందరూ దీనికి చేయూతనిచ్చేవారే. అంతా వేదఘోషయే. అంతా మంత్రపఠనమే. అంతా ఆచార విశేషమే. చుట్టుప్రక్కల నాలుగామడలవరకూ అంతా అలికిడే. అంతా కలకలమే. అంతా అన్న సంతర్పణమే. అంతా పవిత్రతే.

# కార్యక్రమం

ఒక పందిరి వేస్తారు. కిందను బ్రాహ్మణశ్రేష్ఠులు హోమం పేలు
స్తుంటారు. మంత్ర ధ్వని దిక్కులు పిక్కటిల్లుతుంది. వేదఘోష విని
పిస్తూనే ఉంటుంది. అగ్ని సహస్రార్చులతో ప్రజ్వలిస్తుంటుంది హోమ
ధూమం ఆ ప్రదేశమంతా పవిత్రం చేస్తూ వుంటుంది.

పౌండరీకం చేస్తూ వున్న మహానుభావుడూ, అతని భార్యా ఇద్ద
రున్నూ మహాదీక్షతో మహోత్తమమైన నిష్ఠతో సక్రమంగా శాస్త్రోక్తంగా
ఆ పందిరిమీదికి ఎక్కుతారు. ఆ పందిరి కొంచెం బలంగానే సూత్రాల
ప్రకారం కడతారు. పై కప్పుమీద ఇద్దరు స్వేచ్ఛా విహారం చేసినా
పర్వాలేదన్నంత గట్టిగా వుంటుంది. ఆ కప్పు మధ్యభాగంలో ఒక
కన్నం వుంటుంది. పుణ్యాత్ములూ, అదృష్టవంతులూ,పలుకుబడి కలవాళ్లూ
అందరూ చుట్టూ వుండి చూస్తూ వుంటారు. ఆకతాయివాళ్ళు చెట్లూ,
ఇళ్లూ ఎక్కి కనిపెడుతూ వుంటారు గూడాను.

మంత్రాలు చెలరేగుతుంటాయి. వేదనాదం ఆకాశం ముట్టుకుంటూ
వుంటుంది. హోమం సాగుతుంటుంది. ఆ పౌండరీకం చేసే మహాను
భావుడు భక్తిపూరితుడై పోతాడు. అతని భార్యగూడ అలాగే ఉత్సా
హంతో నిండిపోతుంది. ఇద్దరూ పందిరి పై కప్పుమీద ముహూర్తం
కోసం నిరీక్షిస్తుంటారు. ఇంతలో నిర్ణయించిన ముహూర్తం వస్తుంది.

అప్పుడు వాళ్లేమిచేస్తారు? ఇందరు చూస్తున్నారే అనిసంకోచిస్తారా?
అనాచారంకాదా అని భావిస్తారా? ఎవ్వ రేమనుకుంటారో అని చింతిస్తారా?
లేదు. ముమ్మాటికీలేదు. మహాఉత్సాహంతో, పవిత్రకార్యంచేస్తున్నామన్న
ఉబలాటంతో, భక్తితో, దీక్షతో నిష్ఠతో, మహాసంగమ కార్యానికి పూను

కుంటారు. సర్వ ప్రపంచం చూస్తూఉండగానే వాళ్ళిద్దరూ ఆలుమగల ఆట ఆడతారు. అక్కడ సంభోగం చెయ్యకపోతే తరవాత రంభాసంభోగం దొరకదు సోమయాజి గారికి.

అలాగున బహిరంగంగా, శాస్త్రోక్తంగా. మంత్రాలతో వాళ్ళిద్దరూ సంగమించాలి ఆ రేతస్సు కిందనున్న హోమాగ్నిలో పడి ఆహుతి కావాలి. అప్పటికిగాని పౌండరీకం అన్న యజ్ఞం పూర్తి ఫలాన్ని ఇవ్వదు. ఇది ఒక విధమయిన నరమేధ మనవచ్చు—నరబలి వంటిదే బీజరూపములో.

## ప్రత్యామ్నాయాలు :

ఇది సక్రమంగా జరపవలసిన పౌండరీకం. పూర్వం మన పెద్ద లందరూ, శక్తికలిగినప్పుడు, ఇలాగే చేసేవాళ్ళు. కాని దినాలు మారి పోతున్న కొద్దీ పౌండరీకం చేసేవాళ్ళకి, వాళ్ళ భార్యలకి కొంచెం సంకోచం కలిగింది. ఏమిటీ ఈ అనాచారం అని, వాళ్ళకీ, ప్రజలకీ, తోచింది. ఉపాయాలు చూచారు. చెయ్యవలసిన ఆచారం చెయ్యాలి. రానున్న అవమానం రాకూడదు. సిగ్గుమాలిన పని చేశారని ఎవరూ అన కూడదు. ఇందుకోసం ప్రత్యామ్నాయం ఒకటి పెట్టారు.

సోమయాజిగారు స్వయంగా సోమిదేవమ్మతో ఈ పని చెయ్య వక్కర లేదన్నారు. వీరిద్దరికీ బదులుగా మరి ఇద్దరి నెవరినయినా పెట్టి ఆ పని చేయించినా సరే అన్నారు. పనిచేసింది వాళ్ళే అన్నారు. ఇలాంటి మారుబేరాలు కల్పించడం మనవాళ్ళకి వెన్నతోపెట్టిన సంగతే. ఆ తెలివి తేటలతో ఈ ఉపాయం చెప్పారు. పౌండరీకంలో ప్రధానకార్యం నడప డానికి వాళ్ళ కిద్దరికీ వకాల్తా ఇస్తున్నారు.

63

## వకాల్తా పౌండరీకం:

అంచేత ఏం ఇప్పుడు చేస్తారంటే - పౌండరీకం చేసేవాడూ, తన భార్యా దీక్షనుపూని ఉంటారు. కింద చెయ్యవలసిన పనులన్నీ చేస్తారు. పందిరి ఎక్కడానికి మాత్రం పరాయివాళ్ళని పెడతారు. కొంత డబ్బు ఇచ్చి, ఎవ రైనో ఒక స్త్రీని, ఎవడినో ఒక పురుషుడిని డబ్బిచ్చి తెస్తారు. బహిరంగంగా ఈపనిని ఆ పందిరిమీద చెయ్యడానికే ఈడబ్బు ఇవ్వడం.

వాళ్ళిద్దరూ పందిరి ఎక్కుతారు. ఆ సమయానికి ఆ పడుపు ముండయే సోమిదేవమ్మ అనుకోవాలి. ఆ సిగ్గుమాలినవాడే మన సోమ యాజిగా అనుకోవాలి మనం. వాళ్ళని మంత్రాలతో ఒక్కదెబ్బని మార్చే స్తారుగూడా మన ఋత్విక్కులు. మంత్రబలం సామాన్యమా? ఆ మంత్ర బలంతో ఆ యిద్దరూ చేసిన మహా కైంకర్యం, సోమి దేవమ్మా సోమ యాజీ చేసినట్టుగానే భావిస్తారట దేవతలు. దానిమూలంగా సోమయాజి గారికి ఇహంలో గౌరవ వైభవాలూ, పరంలో రంభాసంభోగమూ దొరుకుతుంది. పాపం సోమదేవమ్మ ఏమవుతుందో చెప్పలేదు.

## పచ్చి పౌండరీకంగాడురా!

కొందరు బుద్ధిమంతులు, బాగా చదువుకున్నవాళ్ళు, ఒక జట్టుగా ఉండేవాళ్ళు. వాళ్ళు మాటలాడుకుంటూంటే వినడానికి చాలా ఇంపుగా ఉండేవి. వాళ్ళ వాకోవాక్యాలూ, వాళ్ళ సరసాలూ వ్రాసిపెడితే మహా కావ్యాలు అయిఉండును. వాళ్ళు ఏదైనా సందర్భంలో ఎవడినైనా పరమ రసికుడు అని అనవలసివస్తే వాళ్ళేమనేవారో తెలుసునా? "వాడు పచ్చి

పౌండరీకంగాడురా" అని అనేవాళ్లు. ఇది విన్న ఇతరులకి ఏమీ తెలియదు. వాళ్ళలో వాళ్ళకి చక్కగా బోధపడుతుంది. ఏమని? "నడివీధిలో నైనా ఏదో చేయడానికి వెనకతీయని వాడురా" అని; అంటే సిగ్గూ లజ్జా విడిచిపెట్టిన వాడనిగాని, సంఘం కట్టుబాట్లకు లొంగని వాడని గాని అర్థం. అలా దిగింది పౌండరీకం అర్థం. మాటల అర్థాలు మారుతూ వస్తాయి అంటారు కదా!

ఈ మధ్యను ఒక కవి ఒక సందర్భంలో జరిగిన అనాచారాలను వివరిస్తూ "పూర్వకాలపు పౌండరీకము-వీధివీధుల జరుపుకుంటూ...."అని ప్రయోగించాడు; చిత్రం కాదా!

మన యజ్ఞాలలో మరికొన్ని గూడా ఇలాంటివి వున్నాయి. ఇప్పటి చెవులకి అవి ములుకులులాగ తగులుతాయి. ఇప్పటి కళ్ళకి అవి ముళ్ళలాగ కనబడతాయి. ఇప్పటి బుద్ధులకు అవి అసభ్యంగా తోస్తాయి. కాని ఆ రోజులలో ఇవన్నీ పవిత్రమైన సంగతులే. వాటిని విందించేవాళ్లు పాపాత్ము లయ్యేవాళ్లు, రౌరవ నరకంలో పడిపోయేవాళ్లు. రోజులు మారుతూ రావడంచేత వాళ్లుకూడా మారిపోయారు. ఏవో దొంకతిరుగుడు మాటలూ, అర్థాలూ చెప్పుతారు. కాని, అసలు సంగతులు మాత్రం ఆశ్చర్యకరంగానే వుంటాయి. అశ్వమేధయాగం అంటే మహా పవిత్రమైనది కదా! మహా పురుషు లయితేగాని చెయ్యలేరుగదా! చక్రవర్తుల లాంటివాళ్ళే గాని, ఇతరులు చెయ్యలేరు అంత గొప్ప యజ్ఞాన్ని! ఈ యజ్ఞం ఏమిటి? ఏమి చేస్తారు? అని చూస్తే, ఆశ్చర్యం! గుండెలు నీరయిపోతాయి! నోరు తెరుచుకొని ఉండిపోవలసిందే!

# అశ్వమేధ యాగము

అశ్వమేధయాగం సాధారణులు తలపెట్టే కార్యము కాదు. బ్రహ్మ హత్య చేసిన గొప్పవారూ, మహారాజులూ, చక్రవర్తులూ తప్ప ఇతరులు ఆ మాటే అనుకోజాలరు. అది తేలికగా జరిగే కార్యము కాదు. వందలకొద్దీ మనుష్యులు కావాలి; లక్షలకొద్దీ ధనం కావాలి; అధికసంఖ్యాకులుగా బ్రాహ్మణులు రావాలి; హోమ ధూమాలతో, వేదఘోషలతో, మహా సంతర్పణలతో ఎంతో జోరుగా సాగవలసిన ఘనకార్యము. అల్పులు తలపెట్టగలరా ? తలపెట్టడానికి దానికి తగినంత యోగ్యతా, అర్హతా సంపాదించగలరా ?

వ్యయప్రయాసలతో కూడుకొని ఇంత కష్టసాధ్యమైన ఈ యజ్ఞము చేసినందువల్ల ఆ యజమానికి ఈ లోకములో అఖండమయిన కీర్తి కలుగుతుంది; ఆ లోకములో స్వర్గవాస మహాసౌఖ్యము లభిస్తుంది. తరతరాల వరకు ఆ మహామహుని పేరు ఆ దేశ ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. శాసనాల ద్వారాను, శిలాశాసనాల ద్వారాను, అతని ఈ పుణ్యకార్యము ప్రపంచములో సుస్థిరంగా నిలిచి వుంటుంది. ఇలాంటి ఆధారాలను బట్టే దుష్యంతుడి కొడుకు భరతుడు నూట ముప్పయి మూడు అశ్వమేధ

యాగాలు చేశాడని ఈనాడు మనము తెలుసుకో గలుగుతున్నాము. అశ్వ మేధము చేయగలిగితే జన్మ సార్థకమయినట్టు భావించేవారు.

అంత అమోఘమయిన ఉత్తమ కార్యంగా ఆ రోజులలో గౌర వించిన ఈ అశ్వమేధము ఏమయిందో చూశారా? ఈ కార్యక్రమమంతా అసహ్యాకర మయినదనీ,మహా నీచ ఆచారమనీ ఈనాటి వారందరు తూల నాడుతున్నారు. మన దేశంవారూ అసహ్యించు కున్నారు. ఇతర దేశాల వారూ ఏవగించుకున్నారు. భారతీయ నాగరికతయందు అభిమానమున్న పరిశోధకులుగూడ ఈ కార్యాన్ని అవాచ్య మన్నారు. దయానంద సరస్వతి గారూ తిట్టారు; మాక్సుముల్లర్, జోన్సు మోనియర్ ప్రముఖులు ఈస డించారు. పాపము! యజ్ఞము చేసినవారు ఎంత ఆశాభావముతో ఆనాడు కలలు కన్నారో. ఈనాడు వారికంత అపకీర్తి, విరసన, నిందా దాపురిం చాయి. ఆ నాటి అపరిమిత ఉత్తమ కార్యము ఈనాడు అసహ్యాకరమైంది.

శ్రీరాముడూ, ధర్మరాజూ, జనమేజయుడూ ఎంతో మహావిష్ఠతో చేసిన కార్యాలు నేడు అవాచ్య మయినాయి. కాలమూ, అభిప్రాయాలూ ఎల్లకాలము ఒక్కలాగే ఉంటాయని అనుకోవడం తెలివితక్కువ అవు తుంది.

## పవిత్రత అంతా బూతులోనికి దిగుతూంది :

ఈలాగు చెప్పేసరికి అశ్వమేధయాగం అనగానే పుటిన పవిత్ర అభిప్రాయం అంతా బూతేనా అనిపిస్తుంది. అవును బూతే. కాని ఆ రోజుల్లో ఆ బూతే పవిత్రంగా ఉండేది. అవి మన రోజులు కావు. దానిని ఆ రోజులలో రహస్యంగా ఉంచుకోవాలి అన్న చింతలేదు. తప్పు పని అని అనుకుంటే కదా, రహస్యంగా ఉంచాలన్న బుద్ధి కలుగుతుంది!

మద్యపానం సదాచారం అయినప్పుడు దొంగతనంగా కల్లు తాగేవారుం టారా? బూతుపని మంత్రపూతమూ పవిత్రమూ అయిన రోజుల్లో దానికి దాపరికం ఎందుకు?

## అశ్వమేధం తంతు:

ఈ పవిత్రమైన అశ్వమేధయజ్ఞం గురించి వ్రాయడానికి ఇది జాగా కాదు కాని, ఇందులో జరిగే ముఖ్యమైన సంగతి మాత్రం మనకు కావలసింది. దానినే శ్రీనాథ మహాకవి ఇలాగ చెప్పాడు సంస్కృతం బిగువుతో:

"యజమాన ప్రమదా వికస్వరభగ
న్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండంబగు నశ్వమేధమఖ తం
త్రంబున్ నిరీక్షించుచున్......"

దానికి తేట తెలుగు అర్థం చెప్పాలంటే కొంచెం సంకోచం కలుగుతుంది. కాని సంగతి తెలుసుకోవడమే మనకు ప్రధానం కాబట్టి అర్థం చెప్పుతాను తెలియని వాళ్ళకోసం.

యజమాన-అశ్వమేధయజ్ఞం చేస్తూ ఉన్న అతనియొక్క ప్రమదా-భార్యయొక్క వికస్వర-విప్పారిఉన్న, భగ-స్త్రీ అవయవం (యోని) యందు, న్యస్త-ఉంచబడిన, అశ్వ-గుర్రంయొక్క, దీర్ఘ-పొడుగైన, స్మరిధ్వజదండంబు-మన్మథుని జండా కొయ్య (పురుష అవయవము)ను-కలది, అగు, అశ్వమేధమనే పేరుగల, మఖ-యజ్ఞమునందలి, తంత్రంబున్-కార్యక్రమాన్ని నిరీక్షించుచున్-చూచుచు......

ఈ అశ్వమేధంలో చేసే పనిఏమిటి ? గుర్రం లింగాన్ని యజ్ఞం చేసేవాని భార్య తనయోనిలో పెట్టుకోవడం. ఆ మంత్రాలు అన్నీ ఆ మహా కార్యంకోసమే. గుర్రం అవయవం చెప్పినప్పుడు దీర్ఘ అనిన్నీ, యజమానురాలి అవయవం చెప్పినప్పుడు వికస్వర (విప్పారిన) అనిన్నీ అతికి సంస్కృత మూలసూత్రానికి మెరుగుపెట్టాడు మన శ్రీనాథుడు.అసాధ్యుడు కదా !

## తెలిసినవారు చెప్పిన మాటలు :

ఈ అశ్వమేధ యజ్ఞమును గురించి శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కొంత వ్రాశారు. వారి "మహాభారత చరిత్రము' అన్న గ్రంథములో. వారు విద్వాంసులే కాక సునిశిత విమర్శకులు. ఈ సందర్భంలో వ్రాసిన విషయాలలో ఆనాటి స్త్రీలకు ఒకభర్త అన్న నియమము లేదన్న సత్యముగూడా బయటపడుతుంది. దీని సత్యాసత్యాలను తెలుసుకొనడానికి ఉపకరిస్తుందన్న ఉద్దేశంతో వారి గ్రంథమునుంచి ఈ క్రింది విషయాలు ఎత్తి చూపుతున్నాను :

"భారతకాలమున స్త్రీలకు నియమములేదని వ్రాసి యున్నాను. ఆ నియమాభావము యజ్ఞములలోనె ప్రధానత నొందియున్నది. ప్రతి యిష్టికిని 'అగ్నీధ్రుడు' చేయు 'పత్నీ సన్నహన' కర్మము, జ్యోతిష్టోమమున 'నేష్ట' చేయు పత్నీ సమ్మార్జన కర్మము మొదలగునవి స్త్రీ కేక పతిత్వాభావమునే సూచించును. స్త్రీని సోముడు, గంధర్వుడు, అగ్ని యను దేవతలు వరించిన పిమ్మటను మనుష్యులు వరింతురు అనువంశము కూడ స్త్రీ లనేక పతులు కలవారను వంశమునే దృఢపఱచు చున్నది. అగ్నీధ్ర, నేష్టాదుల కర్మములు స్త్రీయొక్క యేక పతిత్వ ధర్మమును బాహ్యముగనో అంతరంగికముగనో కళంకిత మొనర్చుచున్నవి.

"ఈ యజ్ఞకర్మము లన్నిటికంటె అశ్వమేధమున జేయ సోమి దమ్మయొక్క యశ్వసేవ మఱియు ననహ్యకరమై యుండును. చూడుఁడు. పట్టపురాణి: అంబే అంబాల్యంబికే 'అను మంత్రమును జపించుచు(వధింప బడిన( అశ్వముండాసి 'గణానాంత్వా' అను మంత్రముతో నా యశ్వము నధి మంత్రణముఁజేసి 'ఉత్సక్థ్యోర్గుదం దేహి' యనుచు మృతాశ్వము యొక్క గూఢావయవమును దనగూఢావయవమున నుంచికొని శయనింప వలయును. అపు 'డధ్వర్యుఁడు' సుభగే కాంపిలవాసిని'యను మంత్రము, జపువుచుఁ బట్టుబట్టతో రాణిని గుర్రమును గప్పును. అగ్నీధ్రుఁడు 'వృషాంగంరేతోదధా' అను మంత్రమును జపించును. ఆ రాత్రి తక్కిన ఋత్విక్కులు మహారాజు నిద్రించకుండఁ జేయుదురు" అని వారు స్పష్టంగా వ్రాశారు.

ఇంత మాత్రమే కాదు. యజమానుఁడు తన భార్యల నల్వురను ఋత్విక్కులకు దాన మీయవలయును. ఆ యంశ మిట్లు చెప్పఁబడినది. పట్టపురాణిని బ్రహ్మ యను ఋత్విక్కునకును, ఉపేక్షింపబడిన రెండవ భార్యను హోతి యను ఋత్విక్కునకును. రాజుయొక్క భోగకన్యను ఉద్గాత యను ఋత్విక్కునకును. రాజునకు పాత్రామల నొసఁగు స్త్రీని అధ్వర్యుఁడు అను ఋత్విక్కునకును రాజు దానమీయవలెను.' ఆ స్త్రీలను ఋత్విక్కులు భర్తలవలె హస్తములను గ్రహించిన పిమ్మటను రాజు తగిన ధనమిచ్చి ఋత్విక్కులనుండి యా స్త్రీలను బిమ్మట పుచ్చు కొనును.' అని ఆపస్తంబ, ఆశ్వలాయన శ్రౌతిసూత్రములు చెప్పు చున్నవి అని గూడా వ్రాశారు. గ్రంథవిస్తరభీతిచే నా యంశములను విస్తరించి వ్రాయలేదు.

"జనమేజయుడు చేసిన యజ్ఞములో అతని భార్య గుఱ్ఱముకడ శయనించినపు డా గుఱ్ఱము కదిలినదఁట ; అట్లు కదలుట తప్పు. ఈ

యశ్వపేవాది నికృష్టకర కార్యములఁ జూచియే జనమేజయుఁడు నేఁడు-
మొద లెవరు నశ్వమేధయాగముఁ జేయరా దన్నాఁడు. ఇది మత సంప్ర-
ధర్మములలో గొప్పదగు మార్పె యగును. పిమ్మట స్మృతికర్తలు కలి
యుగమున నశ్వమేధము కూడదని శాసించిరి. దానికి మూలకారకుఁడు
జనమేజయుడే యై యుండెను.

## వివాహనియమము - శ్వేతకేతువు:

"జనమేజయుని కాలమున మహామేధావంతుఁడగు 'శ్వేతకేతువు' అను ఋషి పుట్టియున్నాఁడు. ఈతనికి 'రుణేయుఁడు' ఔద్దాలకి యను వేరు పేరులు కలవు. స్వల్పకాలమే చదివి మహావిద్యావంతుఁడైన ఋషి....

"ఈతడు విద్యావంతుఁడై తండ్రికడ నుండగా నొకప్పుడొక బ్రాహ్మణుఁడు ఋతుస్నాతయైన కుశికసుత యను శ్వేతకేతుని తల్లిని బలాత్కరించి సంతానము నొందుటకుఁ జేయిపట్టుకొని (శ్వేతకేతూద్దాలకుల దగ్గర నుండఁగానే) తీసికొని పోవుచుండఁగా శ్వేతకేతుఁడు మహాక్రోధముతో వలదని నిషేధించియున్నాఁడు. (1) "కోపించిన యా శ్వేతకేతునితోఁ దండ్రియగు నుద్దాలకుఁడిట్లనుచున్నాఁడు. ఓనాయనా! కోపింపకుము. ఇది సనాతన ధర్మము. గోవులవలె భూమియందన్నివర్ణములలోను స్త్రీలు అనావృతలై (ఒక పురుషునకేఁ లోబడనివారై )యుందురు. ప్రజలు పశువులవలెఁ దమ వర్ణములలో నుందురు అనెను.

"శ్వేతకేతుఁ డా ధర్మము నంగీకరింపలేదు. అపుడు శ్వేతకేతుఁడీ మర్యాదను (ఒక స్త్రీ యొక పురుషునకు లోఁబడుటను) స్త్రీ పురుషులకు జేసెను. అది మొదలుకొనియే యీ మర్యాద యున్నదని మనకు వినబడుచున్నది" అని అన్నారు.

(1) శ్లో॥ క్రుద్ధం తంతు పితా దృష్ట్వా శ్వేతకేతు మువాచహ
మా తాత కోపంకార్షీ స్త్వ మేషధర్మ స్సనాతనః
అనావృతాహి సర్వేషాం వర్ణానా మంగనా భువి
యథా గావః స్థితా స్తాత స్వేస్వే వర్ణే తథాప్రజాః
ఋషి పుత్రోధ తంధర్మం శ్వేతకేతు ర్న చక్షమే
చకారచైవ మర్యాదా మిమాం స్త్రీపుంసయో ర్భువి
తదా ప్రభృతి మర్యాదా స్థితేయ మితసః శ్రుతం
వ్యుచ్చ రంత్యాః పతింనార్య అద్యప్రభృతి పాతకం
భార్యాం తథా వ్యుచ్చరంతః కౌమారబ్రహ్మచారిణీం
ఇతితేన పురాభిరు మర్యాదా స్థాపితాబలాత్.

ఆదిపర్వ. 122 అధ్యా.

# బహిరంగ సంగమాలు

బహిరంగ సంగమాలు అని వ్రాస్తే ముక్కుమీద వేలు పెట్టుకోనక్కర లేదు. అది మహాపవిత్రం అంటే ఆశ్చర్యం పడనక్కరలేదు. మనకి ఉన్నదే ఆ ఆచారం.

బహిరంగ సంగమాలూ వాటి పవిత్రతా మనదేశంలో ఎలాగుండేవో మనవి చేశాను. ఇంకా కొన్ని యజ్ఞాలలోగూడా ఈ బూతులు జరగవలసే ఉండేది. బూతు ఆ దినాలలో పూతంగానూ, పురుషార్థంగానూ ఉండేది. ఇప్పుడు మనం పనులలో ఎలాగున్నా. పైకి మాత్రం వాజూకు వాళ్ళలాగ కనబడతాం, సభ్యత అంటే మన అభిప్రాయాలు వేరు అయిపోయాయి. బూతు అంటే చూలు అయిపోతుందేమో అన్నట్టు భయం కనబరుస్తాం. ఇదంతా పైపై మెరుగే లోలోపల మానవహృదయం అప్పుడూ ఇప్పుడూ ఒక్కలాగే ఉంది. ఈనాడు మానవులు చేస్తూ ఉన్న పనులూ, ఆలోచిస్తూ ఉన్న భావాలూ చాలామట్టుకు తెరమరుగుగా ఉన్నాయి. ఆ తెర కొంచెం తొలగించి చూడగలిగితే, ఏముంది? ఆనాటి అనాగరకులకీ నేటి ఈ సభ్య జీవనులకీ భేదం అట్టే కనబడదు. వాళ్ళ సంతతి వాళ్ళమే మనం అనీ, మన తాతలే వాళ్లు అనీ చక్కగా నిదర్శనం కనబడుతుంది. వాళ్ల విచ్చల

విడిగా చేసే పనులే మన రోజులవాళ్ళు దాపరికంగా చేస్తున్నారు. అంతకు మించి ఏమీలేదు. అది సృష్టి తత్వంలోని ముఖ్యసూత్రం దాని కేమిటెండి.

## సంవత్సరానికొకసారి:

సంగమాలంటే పవిత్రమైన పనులన్న సంగతి రూఢి అయింది కదా! ఇకను అందరూ ఆ పనులు విధాయకంగా చెయ్యాలి అన్న సంగతిని గురించి ఏమిటి? సంవత్సరానికి ఒకసారి అయినా వ్యభిచరించాలిఅన్న సూత్రం మనలో ఉందా? అని అడుగుతే, ఢంకామీద దెబ్బకొట్టి "ఉంది" అని గట్టిగా చెప్పాలి. మనం ఇప్పుడు తెలివిమిరి పోయాం కాబట్టి, ఆయా సమయాల్లో బహిరంగంగా వ్యభిచారం చెయ్యకుండా ఉన్నాం అంటే చెయ్యలేకుండా ఉన్నాం సభ్యతవల్ల. దానికి బదులుగా మహా స్వేచ్ఛకో, ఎప్పుడూ ఉండనంత విచ్చలవిడిగా, పైపై ఆటలు సాగిస్తున్నాం. అసలు పనిమాత్రం తప్పించి తక్కిన అన్ని పనులూ చేస్తున్నాం.

## పానమహం:

ఆ రోజులలో "పానమహము" అని ఒక పండుగ ఉండేది. పానం అంటే త్రాగడం, మహం అంటే పండుగ. ఆ దినం అందరూ తాగవలసిందే. తాగి వాళ్ళు స్వేచ్ఛగా, విచ్చలవిడిగా, ఎవరి నిందా పడకుండా విహరించేవాళ్ళు. చాలా వేడుకగా ఉండవలసిన రోజు. వరసలకీ వావులకీ ఆ దినం తావుగా ఉండదు. హాస్యానికి అంతు ఉండదు. ఆగ్రహానికి అవకాశం ఉండదు. స్వేచ్ఛ అలా చెలరేగుతూ ఉంటుంది.

అలాగే మనకిగూడా కొన్ని పండుగలున్నాయి. వాటిలో ఎంత హాస్యం పనిచేసినా తప్పులేదు. తిట్టరు. ఒకవేళ ఎవళ్ళయినా తిట్టినా, వాళ్ళని నలుగురూ కలిసి నోరునొక్కేస్తారు. ఈవే కోపం తెచ్చుకో కూడదని మందలిస్తారు.

## అలాంటిదే హోలీ పండుగ :

అలాంటిదే హోలీ పండుగ. ఆ దినం కామదహనం చేస్తారు. ఇక్కడకామ అన్నది మన్మథుడు అన్న అర్థంలో కాదు. దేవుడు ఈశ్వరుడు అన్న అర్థంలో ప్రయోగం. ఈ దేవుడే పంట దేవుడు. పాతదేవుడు బల హీనం అయిపోతాడు కాబట్టి అతని బలం అంతా కొత్త దేవుడికి ఇవ్వ డానికి అతన్ని కాల్చి వేసేవాళ్లు. కొన్నాళ్లు ఈ పనికి మనుష్యులనే చంపేవాళ్ళు. తరవాత తరవాత బొమ్మలని కాల్చడం ఆరంభించారు. అలాగ కామదేవుడ్ని కాల్చేవాళ్ళు సంవత్సరాని కొకసారి.

## కామదహనం ఏమిటి ?

అదే పంటకాలం. ఆ కామదేవుడి గురుతు ।।। ఇలాగ ఉండేది. మధ్యను నిడుపుగీత, ఈ పక్కా ఆ పక్కా చిన్నచిన్న గీతలు. అది పురుష అవయవం గురుతే అని వేరే చెప్పనక్కరలేదు. ఈ కామదేవుడి గురుతే మన సంస్కృతంలోని (।) అన్న అక్షరంగా పరిణమించింది. ఈ కామదహన సమయం కొత్త పంటకాలం అన్నమాట. పంట ఉత్స వాలు ఎలాగుండేవో ఇంతకుముందు మనవిచేశానుకదా. అలాంటి స్వేచ్ఛా విహారమే ఈహోలీపండుగనాడు జరిగేది అని అనుకోవాలి. అంటే పురుషా వయవంలాగ ఉండే దేవుడికి ప్రీతి చెయ్యాలన్నమాట ఆ రోజు. కామ

సంతర్పణకి ఆ రోజు అద్దూ అపూ ఉండదన్నమాట. అలాగే మనవాళ్ళు చేసేవాళ్ళు ఆ రోజులలో.

## వాజూకు రోజుల్లోనో ?

కాని రోజులు మారిపోయాయి. పై మెరుగులు ఎక్కువ అయి పోయాయి. అందుచేత ఆ దినం వ్యభిచారం అంతరించింది. కాని ఆ స్వేచ్ఛా విహారం మాత్రం తగ్గలేదు. రంగు నీళ్ళతోనే అన్ని రంగులూ ప్రకటించుకుంటారు. ఎవరు ఎవరినైనా సరే దోషం లేదు. సరసలు పెట్టుకోడానికి పన్నెకెక్కిన రోజు. హాస్యాలకి నవ్వులకి కోరికలు తీర్చు కోడానికి మంచి సమయం. ఎవడైనా మడికట్టుకున్నవాడు ఆ చేష్టలూ ఆ కేరడాలూ ఆ స్వేచ్ఛా అంతా చూస్తే నిర్ఘాంతపోతాడు. ఏమిటి పాపం ఇలాగ పెరిగిపోతూ ఉందనుకుంటాడు. సిగ్గూ లజ్జా లేదా ఏమిటి అని అనుకుంటాడు. అంత విచ్చలవిడిగా ఉంటుంది ఆరోజు. ఇవన్నీ పూర్వ కాలపు వ్యభిచారానికి ప్రత్యామ్నాయాలే. మరేమీ కావు, అంటే మారు రూపాలు.

## నిజరూపం ఎక్కడైనా వుందా ?

మారురూపాలు చూపిస్తే మన వాళ్ళకి నచ్చదు. నిజరూపాలు చూపించమంటారు. విచ్చలవిడిగా వ్యభిచారం చెయ్యడం ప్రత్యక్షంగా చూశాలంటారు. అది ఒక మత సంబంధమైన ఆచారంగా ఉండడం కన బడాలంటారు. మారిపోయిన ఈ రోజులలో ఇలాంటివి కనబడాలంటే కొంచెం కష్టంగానే ఉంటుంది కదా! అయినా మన అదృష్టవశాత్తు ఈ

దినాలలో గూడా ఇలాంటి ఆచారం ప్రత్యక్షంగా చూడడానికి కొంచెం అవకాశం వుంది.

## రవికల పండుగ :

మనలో ఒక శాఖ వుంది. ఆచారవంతమైన శాఖ. ఆ శాఖలో సంవత్సరానికి ఒకసారి కంచుకోత్సవం అని ఒక పండుగ చేసుకుంటారు. కంచుకం అంటే రవిక. ఉత్సవం అంటే పండుగ. అదే రవికల పండగన్నాను అందరికీ తెలియాలని. ఈ పండుగ చాలా పట్టుదలతో చేస్తారు. విష్ణకి సీమాకి లోటు వుండదు. వీరూ వారూ అని విచక్షణ లేకుండా ఆ శాఖలో అందరూ కలియవలసిందే. దీని సంగతి చెప్పడానికి ముందు ఒక మాట మనవి చెయ్యాలి.

## స్వేచ్ఛా వ్యభిచారంలో చిక్కులు :

సంవత్సరానికి ఒక్కసారి అందరూ వ్యభిచారం చెయ్యాలని ఒక పద్ధతి పెట్టగానే ఎప్పటికైనా ఒక చిక్కు రాకతప్పదు. ఒక స్త్రీ ఉంటుందనుకోండి, ఆ స్త్రీని ఎలాగయిన ఆ పండుగనాడు పట్టుకొని అనుభవించాలని ఇద్దరు పురుష లున్నారనుకోండి. తీరా ఆ రోజు వచ్చే సరికి అందులో ఒకడు దానిని అంకించుకుంటాడు. అప్పుడు రెండోవాడికి క్రోధం కలగడం సహజం. దానివల్ల కొన్ని అగచాట్లు పుట్టవచ్చును. అవి పెరిగి పెద్దవయి మహా వైరాలు,దెబ్బలాటలుగా పరిణమించవచ్చును. అంచేత అలాంటి చిక్కులు లేకుండా ఒక లాటరీ లాంటి పద్ధతి పెడితే మరేమీ బాధ ఉండదు గదా! లాటరీలో వచ్చింది మన పురాకృతం అని

కిక్కురు మనకుండా ఊరుకుంటాం. అయ్యో! మనకి దొరకలేదే అని ఏడుస్తాంగాని వాడిమీదా వీడి మీదా పగ పట్టం. మనవాళ్లు బుద్ధిమంతులు కాబట్టి అలాంటి లాటరీ ఒకటి పెట్టారు. ఆ లాటరీయే రవికలు.

## దీనిలోని తంతు :

పండుగునాడు ఆడవాళ్ళందరూ కోవెలకి వస్తారు. పూజలూ, పునస్కారాలు అన్నీ జరుగుతాయి. తరువాత ఆడవాళ్లు అందరూ తాము తొడుగుకొని వున్న రవికలుతీసి ఒకచోట పోగుగా పడవేస్తారు. తరువాత మగవాళ్లు అందరూ ప్రవేశిస్తారు తలా ఒక్కొక్క రవికను తీసి పట్టుకుంటారు.

## రవిక పట్టినవాడే రమణుడు :

సూత్రం ఏమిటంటే – ఆ రవిక ఎవరిదో ఆ స్త్రీ ఆ రాత్రి అంతా ఆ మగవాడితో భోగించాలి. దానిలో తప్పులేదు. అలా చెయ్యకపోతే తప్పు. రవికని ఎత్తినవాడు బాగున్నా సరే, బాగులేకపోయినా సరే, మనసుకి నచ్చినా సరే, నచ్చకపోయినా సరే, ఆ రాత్రి అతనితో గడపవలసిందే నిశ్శంకగా. అదృష్ట దురదృష్టాలన్నీ ఆ రవికల చేతుల్లో ఉంటాయి. ఆ రోజున రవికను పట్టాడంటే రమణుడన్నమాట. అతన్ని అన్ని విధాలా సంతోషపెట్టాలి ఆడది. తెల్లవారిన తరువాత ఎవరి భర్తల దగ్గరికి వాళ్లు వెళ్ళి సంసారం చేసుకుంటూ ఉంటారు. వాళ్ళ పాతివ్రత్యాన్ని ఈ పండుగునాటి పని యేమీ పాడు చెయ్యదు. మీదుమిక్కిలి ఆ పనివల్ల వాళ్ళ పుణ్యం ఎక్కువ అవుతుంది. ఈ పండుగు నేను

చూపించిన "సంవత్సరానికి ఒకసారి" అన్న సూత్రం ప్రకారం జరిగేదే ఇది మన దక్షిణ హిందూస్థానంలో ఉంది. పేరు తెందుకులెండి।

## పా ర శీ కు ల లో ని ప ద్ధ తి :

పారశీకులలోగూడా ఈ ఆచారం ఉంది. చిన్న మార్పుతో. వారు కూడా మహా ఉత్సాహంతోనూ, ఉద్రేకంతోనూ ఈ పండుగ కావిస్తారు. పూజామందిరంలో పురుషులందరు తమ లాగులు విప్పి ఒకచోటవేస్తారు. దీపాలు ఆర్పేస్తారు. కనిపెట్టుకున్న ఆడవాళ్ళందరు ఆ చోటికివెళ్ళి ఎవరి కందిన లాగును వారు పట్టుకుంటారు. దీపాలు వెలుగుతాయి. ఆ లాగు ఎవడిదయితే వాడితో ఆ స్త్రీ ఆ రాత్రి గడపాలి.

## రా మా మే లా :

దీనికి బదిలీ ఉత్తర హిందూ స్తానంలో గూడా ఉంది. అక్కడ ఉత్సవం పేరు "రామా మేలా". అదీ సంవత్సరానికి ఒక్కసారే. ఆ పర్వ దినంనాడు జనం అంతా ఏటిఒడ్డున జమ అవుతాయి. ఆడవాళ్ళంతా ఎగువ రేవున ఉంటారు. మగవాళ్ళు దిగువరేవున ఉంటారు. పుణ్యకాలం చూచు కొని అక్కడ ఆడవాళ్ళూ ఇక్కడ మగవాళ్ళూ స్నానానికి నీటిలో దిగు తారు. ఆడవాళ్ళు స్నానంచేస్తూ వాళ్ళ రవికలని నీటిలో విడిచిపెడతారు. అవి కొట్టుకొని వస్తూ ఉంటే ఇక్కడ మగవాళ్ళు తలా ఒక రవికను పట్టుకొంటారు. ఆ రవిక ఎవరిదైతే ఆ ఆడది ఆ రాత్రి అతని సొమ్ము. అతను ఆ రాత్రి ఆ స్త్రీకి సాక్షాత్తు కామదేవుడు. వాళ్ళు చేసినపని అంతా పుణ్యమూ దేవతాప్రియమున్నూ. ఆ పనివల్ల వాళ్ళ పాతివ్రత్యం భంగం కాదు.

## "పండుగువాడూ పాత మొగుడేనా ?"

ఇలాంటి ఉత్సవంలో ఒకనాడు చాలా విచిత్రమైన సంగతి ఒకటి జరిగింది. ఒక అమ్మ తన రవికను వేసి, ఎలాంటి వాడు దొరుకుతాడో అని ఎదురెదురు చూస్తూంది. అంతలో ఒక మనిషి తన రవికను ఎత్తి చూపుతూ "ఎవరిదీ రవిక" అనుకుంటూ దగ్గరికి వచ్చాడు. "నాది" అని ఆ అమ్మ చాలా ఆశతో వెళ్ళింది. తీరా దగ్గరికి వెళ్ళేసరికి ఏముంది ! తన పాత మొగుడే !" పాపం, ఆ అమ్మకి మనసు చివుక్కుమన్నది. "పండుగనాడూ పాత మొగుడేనా?" అని ఆ అమ్మ చాలా దీనంగా అన్నది. ఆ మాటే మనకి ఒక లోకోక్తిగా, ఒక సామెతగా ఈనాటికీ వుంది. తెలివి మీరిన మనవాళ్ళు ఆ లోకోక్తిని మార్చి మరొకలాగ అనవచ్చు. అసలు సంగతి మాత్రం అది. ఇలాంటి దుర్ఘటనలు అప్పుడప్పుడు కలుగుతుంటాయి పాపం !

## చరిత్రలూ శాసనాలూ సాక్ష్యం :

ఇలా ఈనాడుగూడా ఈ ఆచారం నిలిచివుంది. ఎన్ని స్థలాలలోనో ఇది అంతరించిపోయింది. ఇంతకుముందు ఈ ఆచారం సర్వత్రావుండేది. అభిప్రాయాలు మారడంవేత అనేక ఆధారాలు అలా మారిపోతూ వుంటాయి, పోల్చుకోడానికి గూడా వీలులేకుండా. ఈ ఆచారాలు ప్రపంచం అంతటా వుండేవి. అని చెప్పడానికి చరిత్రలూ, శాసనాలూ సాక్ష్యం వున్నాయి. అనేక దేవతల పూజా విధానాలు ఈ మాటనే రుజావు చేస్తున్నాయి. కాని కొన్నాళ్ళకు ఈ ఆచారాలు మానివేస్తే బాగుండును అని తోచింది.

## మానడానికి ప్రయత్నాలు :

సభ్యత అంటే కొత్త అభిప్రాయాలు కలిగాయి. ఏమిటి సిగ్గుమాలినతనం అని కొందరికి తోచేది. కొంతమంది స్త్రీలకిది అయిష్టంగా వుండేది. అన్నిటికీ ముఖ్యం మగవాళ్ళకి చూస్తూ చూస్తూ తమ పెళ్ళాలని మరొకరి దగ్గరికి పంపడం కంటకంగా తోచేది. ఇతరుల పెళ్ళాలని వాళ్ళు ఏమిచేసినా మనసు నొవ్వదు గాని, వాళ్ళ పెళ్ళాలని ఇతరులేమైనా చేస్తే ఒప్పుకోరు కదా! ఇదొక చిత్రమైన తత్వం మన మగవాళ్ళది. ఎలాగయితేనేం, కొన్నాళ్ళకి ఈ ఆచారం మానుకుంటే బాగుండునని అనిపించింది. ఆనరికి సంగమం చేస్తేనేగాని పంటలు పండవు అన్న అభిప్రాయంగూడా కొంత మారిపోయింది.

## చక్రవర్తి శాసనం :

కాని మానమంటే మానతారా? పాపాత్ములని పడతిట్టరా? కాని దుర్మార్గుడని బహిష్కరించరా? సాధారణుడు అలా మానండి అని సమాళించుకోగలడా? సర్వశక్తులతువున్న చక్రవర్తి కావాలి దాన్ని ఆపడానికి. అలాంటి చక్రవర్తి ఒకడు కలిగాడు. అతనయినా ఒక్కసారి ఈ ఆచారం మానండి అని శాసించలేకపోయాడు. కొంచెం తగ్గినా కొంత మేలే అన్న సూత్రం ఉపయోగించాడు. ఆ రూపంగా మాన్పించడానికి బీజం వేశాడు. వ్యభిచరించడం ఇష్టం లేకపోతే ఒక ప్రత్యామ్నాయం చూపించాడు. పుణ్యాన్ని పోయాడు.

## తలవెంట్రుకల అర్పణ:

ఆ చక్రవర్తికి ఈ ఆచారంమీద అసహ్యం, సంపూర్ణంగా మాన్పించాలనే ఉండేది. కాని ప్రజలు ఒప్పుకోరు కాబట్టి ఆలోచించాడు. వ్యభిచరించడానికి ఇష్టంలేని వాళ్ళని నిర్బంధ పెట్టడం మంచిదికాదని ప్రజలకి నచ్చచెప్పాడు.భక్తిపూర్వకంగా లేని అర్పణవల్ల ప్రయోజనం లేదన్నాడు. కాబట్టి అలాంటివాళ్లు తలవెంట్రుకలను సమర్పించాలని అన్నాడు.అది అవమానం చూపించడానికి అనండి, ఆదే ఒక శిక్ష అనండి. ఏమైనా అనండి. వెంట్రుకలను ఇవ్వమన్నాడు చక్రవర్తి. అయినప్పటినుంచీ వ్యభిచారం వద్దన్న వాళ్లు వెంట్రుకలను ఇచ్చేవాళ్లు దేవుడికి. రాను రాను వ్యభిచారం పోయి వెంట్రుక లివ్వడంతో తీరింది ఆరాధన. దేవుడికి వెంట్రుకలిస్తే చెయ్యవలసిన సమర్పణ చేసినట్టుగానే భావించారు. అది అలా ఆచారంగా వచ్చింది. అదే మనవాళ్లలో జరుగుతూ ఉంది. అదే మొక్కుకుంటాం. కష్టాలలో "ఈ రోగం కుదిరితే, శ్రీ వెంకటేశ్వరమూర్తి నా తల వెంట్రుకలు నీకు సమర్పించు కుంటాను" అని మొక్కుకుంటాం. రాను రాను పుణ్యక్షేత్రానికి వెళ్ళితే బోడిగుండు అయిపోవడం ఆడవాళ్ళకీ మొగవాళ్ళకీ ఆచారం అయింది ఇప్పుడు. కాని, ఆనాడు మనం చెయ్యవలసిన వ్యభిచారానికి బదులుగా వెంట్రుకలను బలి ఇస్తున్నామన్నమాట మనం మరచిపోయాం.

## బాధలేని ప్రత్యామ్నాయం?

ఇష్టంలేని శిక్ష ఇవ్వవలసివచ్చింది చక్రవర్తికి. అందుకే అట్టే బాధలేని ప్రత్యామ్నాయం కల్పించాడు. నాలుగు రోజులకి మళ్ళా ఎప్పటిలాగే వస్తుంది కొప్పు. ఇలాంటి బలి ఎన్నిసారు లివ్వమన్నా భయంలేదు.

గదా! బాధలేని ప్రత్యామ్నాయం కల్పించడం అంతా చరిత్రలలో ఉన్న సంగతే గాని కవితాశక్తి కాదు. ఉత్ప్రేక్షకాదు. రంగు సులోచనాలు అంత కన్నా కావు. వాస్తవం, చరిత్ర సిద్ధం అయిన సంగతి.

## బూతు ప్రతిమలు అర్పించడం :

ఆడవాళ్ళు కోవెలలో ఈ బూతుపనులు చెయ్యడానికి ఇష్టం లేక పోతే మరొక రా పని చేస్తూ వున్నట్టుగా ఒక ప్రతిమ తయారు చేసే వారు. ఆ బొమ్మను చాలా భక్తితో తెచ్చి సమర్పించేవారు. ఆశియా మైనరులో అనేక దేవాలయాలలో ఇలాంటి బొమ్మలు తవ్వి తీశారు. ఇవన్నీ సమర్పించినవే అని రూఢి చేశారు.

## కోళ్ళచేత బూతు చేయించడం :

కొన్నిచోట్ల మనుష్యులు బూతుపని చెయ్యడానికి బదులు కోళ్ళ చేత ఉత్సవంలో ఈ పనులు చేయించేవారు. ఆ బూతు చేసిన తరవాత ఆ కోళ్ళని బలిఇచ్చి చంపి తినేవాళ్ళు.

ఈ ఆచారం ఇప్పటికీ మన దేశంలో వుంది. బెంగాల్‌లో ఒక కొండజాతి వుంది. వాళ్ళ ఉత్సవంపేరు "ఖద్ది". ఆ ఉత్సవంలో సూర్య భగవానుడికీ భూదేవికీ పెళ్ళి చేస్తారు. అంటే ఇదిగూడా ఒక పంట ఉత్స వమే అన్నమాట. (ఉపులేరో వివాహం 8 గ్రంథంలో చూడండి.) దీని తంతు చూదాం.

ఒక తెల్లని కోడిపుంజుని తెస్తారు. అది సూర్యభగవానుడు. ఒక నల్లని పెట్టని తెస్తారు. అది భూదేవి. ఆ రెంటికీ పసుపు కుంకుమా

పుష్పాలూ అన్నీ పెట్టి అలంకరిస్తారు. ఆ రెండు సంగమిస్తుంటే చూచి భక్తితో నమస్కారాలు చేస్తారు. తరవాత వాటిని చంపుతారు.

ఆ కోళ్ళ సంగమాన్నిపట్టి తమకి రాబోయే సంవత్సరం సుఖంగా వుంటుందో కష్టాలతో నిండివుంటుందో తెలుసుకుంటారు.

ఇలాగ చూపిస్తూ వున్నారు. వ్యభిచార భక్తి లోకంలో నాగరికత మించిపోతూ వున్నకొద్దీ ఈ ప్రత్యామ్నాయాలు పెరిగిపోయాయి.

# ఇరుకు రాళ్లు

మన దేశంలో కొన్ని పుణ్యక్షేత్రాలలో ఇరుకురాళ్లు ఉన్నాయి. కొండలో ఒక చిన్న త్రోవలాగ కనబడతాయి ఈ రాళ్లు. మధ్యనుండే దాగా చాలా ఇరుకు. ఒక మనిషి విశాలంగా నడిచిపోలేడు. అలా ఉన్న చోటంతా మనవాళ్లు దానికి పెద్దపెద్ద పేరులు పెట్టారు.

గోగర్భం అన్నారు, పాపనాశనం అన్నారు. నేను పాపాత్ముడిని అనుకుంటూనే దానిలోనుంచి వెళ్ళాలన్నారు. అలాగ అనుకోకపోతే ఆ రెండురాళ్లు అలా దగ్గరికి చేరుకొని ఆ మనిషిని చంపి తమలోనికి ఈడ్చుకొని పోతాయన్నారు. తరవాత మళ్ళీ కాశీ లోనే కనబడుతుందన్నారు. మొన్న నొకడు అలా చచ్చిపోయాడంటారు. ఆనాడు ఒకడు అలాగే అయిపోయా డంటారు. వచ్చిన యాత్రికుల కందరికీ భయం కలిగించేస్తారు. రెండు మంత్రాలు చదువుతూ అక్కడ ఉన్న పూజారులు డబ్బు తీసుకొంటూ ఉంటారు.

చూచారా, ఎంత తంతు పెంచారో! మనవాళ్ళు.

ఇంగ్లండ్‌లో కారన్వాల్‌లోనూ, ఐర్లెండులోనూ ఇలాటి ఇరుకు

రాళ్ళనూ సొరంగాలనూ చాలా గౌరవంతో చూచేవారు. కుదరని రోగా లతో బాధపడుతూ ఉండేవాళ్లు, ఈ ఇరుకురాళ్ల లో నడుచుకుపోతే వారి రోగాలు బాగవుతాయని అలా చేసేవారు. అక్కడ సొరంగాలను "దేవీ భగాలుగా" భావించేవారు. దానిలో నడుచుకొని పోవడంవల్ల పాపాలన్నీ పోయి పునర్జన్మ పొందినట్లు తలచేవారు. స్త్రీలు సంతాన ప్రాప్తికోసమూ, పురుషులు వీర్యవృద్ధికోసమూ ఈ పనే చేసేవారు.

విశాఖపట్టణము జిల్లా విజయనగరం దగ్గర రామతీర్థాలు అని ఒక పుణ్యక్షేత్రముంది. శ్రీరాముడు సీత అరణ్యవాసానికిపోతూ ఇక్కడ ఆగినట్లు చెప్పుకుంటారు. అక్కడ ఇలాంటి ఇరుకురాయి ఉంది. యాత్రి కులు దీనిలో నడుచుకుంటూ, "పాపుడను, పాపకర్ముడను, పాపాత్ము డను, పాప సంభవుడను" అని మాటలలోనో, శ్లోకాలగానో అంటూ వెళ్తారు—ఇప్పటికీ దేవి యోని అన్న అభిప్రాయం అక్కడ వున్నట్లు కనపడదు.

## యో ని పూ జ

పురుషావయవం లింగానికి పూజలుంచే స్త్రీగోప్యాంగము యోనికి పూజలు చేయడం గూడా వుంది. కర్నూలుజిల్లాలో అలంపురమన్న పురా తన పుణ్యక్షేత్రముంది. ఇక్కడ వున్న దేవతకు ఈ యోనిపూజ చేస్తుం టారు—ఇప్పుడుగూడా. ఇక్కడి దేవి విగ్రహము రాతితో చెక్కుతూ శిల్పి తొడలను దూరముగా వుంచి యోని స్పష్టంగా విప్పారి – కనిపించే లాగు మలచినాడు. ఈ భగ పూజ చేసినవారికి అష్టభాగ్యాలు అనాయా సంగా లభిస్తాయని నమ్మకము. ఆ దేవత శిల్ప విగ్రహం ఫొటోలుగూడా అక్కడ దొరుకుతాయి. ఈ విధంగా స్త్రీ పురుష గోప్యాంగాలకు ఆరాధన జరుపుతూ, వాటియందే దేవతా భావ ముంచి భక్తితో ప్రజలు ప్రవర్తి

స్తారు. ఇలాంటి మహత్వం వాటి యందుంచబట్టే ఈ అవయవ ప్రదర్శ నంతో దృష్టిదోషం తగలకుండా కాపాడుకుంటారు.

## దిష్టి బొమ్మలు

పైరులకు గాని, గృహాలకు గాని దిష్టిదోషం తగలకుండా ఉండ డానికి దిష్టిబొమ్మలు కడతారు - చాలపట్టువలలో. ఈ బొమ్మలు సాధార ణంగా పురుషాకారంగా ఉంటాయి. వాటిగోహ్యాంగం మాత్రం చాల అతిశ యోక్తితో ఉంటుంది. ఇది మనదేశంలో అన్ని చోట్లా ఉన్నదే. స్త్రీ అవ యవాన్ని అలాగ ఉపయోగించడం కొంచెం అరుదు కాని. పడవలు నడు పుతూ ఉండేవాళ్ళు నది నదిలో ఉంటూ ఉన్నప్పుడు హోరుగాలి-తుపాను లాగ కొట్టినట్టయితే, అప్పుడు పడవనడిపే వాళ్ళ ఆడది ఏమి చేస్తుందో తెలుసునా ? ఆ గాలి వీచుతున్న దిక్కున నిలిచి, తన చీరను విప్పి ఆ గాలిని బెదరగొడుతుంది. దేవతామూర్తి ఆకారంచూచి గాలి తన ఉద్రేకం మానుకుంటుంది అని వారి నమ్మకం.

## పాశ్చాత్య దేశాలలో

దిష్టిదోషం పోవడంకోసం స్త్రీ అవయవాన్ని గృహ నిర్మాణంలో చూపించడం పాశ్చాత్య దేశాలలో మొన్న మొన్నటివరకు ఉండేది - ముఖ్యంగా వాళ్ళ దేవాలయాలు - చర్చీలలో - చర్చీ ముఖద్వారము మీద - సరిగా మధ్యను - ఒక స్త్రీ విగ్రహం తన అవయవాన్ని విప్పా రించి చూపుతూ ఉన్నట్లు నిర్మిస్తారు. ఇటీవల దిష్టిదోషంమీద నమ్మకం పోవడమూ, ఈ విగ్రహాలు ఎవహ్యంగా కనిపించడమూ - ఈ రెండు

కారణాలవల్లా, ఆ విగ్రహాలను తీసివేస్తున్నారు. అయినా ఇంగ్లండు. ఐర్లెండు దేశాల మ్యూజియములలో ఈ విగ్రహాలు ఇప్పటికీ చూడ వచ్చును.

## చాలా దేశాలలో ఉన్నాయి:

ఈ ఇరుకురాళ్ళు ఒక్క మనదేశంలో కాక చాలా దేశాలలో ఉన్నాయి. అక్కడగూడ ఇలాగే భక్తులు సందున బడి పోతుంటారు. కాని పాపాత్ములన్న బుద్ధి వాళ్ళకిలేదు. రాళ్ళు నలిపి మింగేస్తాయన్న భయమూ వాళ్ళకి లేదు. అలా చెయ్యడానికి మరొక కారణం ఉంది.

## ఆడవాళ్ళయితే, పిల్లలు పుట్టాలని; మగవాళ్ళయితే, వీర్యవృద్ధి కావాలని ఈపని చేస్తారు:

అంతేగాని మరొక కారణం కాదు. ఆ తోవే దేవతా భగం కొన్నిచోట్ల అక్కడ ఉన్న కొండను ఒక దేవతగా చెక్కి, ఈ సారం గం ఏ భావంతో చూచేవారో రుజువుచేశారు.

'రా' అన్న దేవతకి గూడా ఇలాంటి ఒక మహావిగ్రహం నిర్మించారు. అక్కడ గూడా ఇలాంటి ఆచారమే చేస్తూ వచ్చేవారు.

అందుచేతనే సంతానభాగ్యము ఆడవాళ్ళకిన్నీ, సంభోగభాగ్యము మగవాళ్ళకిన్నీ కలుగజేస్తుంది ఆ దేవత అవయవం.

సర్ ఫ్రేజర్ తన "అట్టిస్ అసిరిస్,అడోనిస్"అన్న పుస్తకంలో ఈ ఇరుకురాళ్ళని గురించిన్నీ, వాటి అభిప్రాయాలను గురించిన్నీ చాలా

వ్రాశారు. దేశదేశాలలో ఉన్న ఆచారాలను వ్రాశారు.

దీనికి రుజువుగా హోగార్తు తాను మరికొన్ని కొత్త సంగతులను చెప్పారు.

అబెర్డీన్ షైర్‌లో డీ నది ఒడ్డున (ఇంగ్లిమదేశములో) ఇలాంటి ఇరుకు రాళ్ళు ఉన్నాయి. పిల్లలు కావాలని కోరిన స్త్రీలు ఆ సందులోబడి నడుస్తారు. అలా నడిచినందువల్ల పిల్లలు పుడతారని ఒక ఆశ. ఇది ఇప్పటికీ జరుగుతూ ఉంది.

మహమ్మదీయులదేశాలలోనూ క్రిష్టియనుల దేశాలలోనూ,ఈఆచారం అక్కడక్కడ కనబడుతూనే ఉంది. అని వెస్టర్ మార్కు వ్రాస్తారు.

అంటే అర్థం ఏమిటి? దేవాలయంలోవున్న దేవతకూ, ఆ సంగమ కార్యానికి ఏవిధమయిన మహత్వం ఉందో అలాంటి మహత్వమే స్త్రీ పురుష అవయవాలకుంది అని ఆ రోజుల విశ్వాసము. దీనిలో ఒక చిత్రం ఏమిటంటే, పురుషావయవ–లింగ–పూజ విషయంలో స్త్రీలు ఎక్కువ ఉత్సాహం చూపించడం.

## ప్రయపస్ లింగపూజ

గ్రీసు పంటదేవుడు ప్రయపస్ పూజలు విచ్చలవిడి సంగమాలే అని మనవి చేశానుకదా! ఈ పూజలలో చెలరేగేవాళ్లు స్త్రీలు. ఆ దేవుడు అత్యంత దీర్ఘమైన అవయవంతోఉండే మానవాకృతి. స్త్రీలింతగా ఆ పూజలకు ఎగబడుతూండడం మగవారికి కిట్టలేదు. లంప్‌సాకస్ అన్న ఊరిలో మగవారు ఈ ప్రయపస్ పూజలు నిషేధించారు ఒకప్పుడు. ఆ విగ్రహాలను కనబడకుండా చేశారు. ఏమయిందో తెలుసునా? కొన్నాళ్లయిన తరువాత ఆ ఊరి మగవారికి చాలామందికి ఒక విధమయిన'లింగరోగం'కని

పించింది. దానితో మగవారు చెంపలు వేసుకొని ప్రయపస్ దేవునిని తిరిగి ప్రతిష్ఠించి బాగుపడ్డారు. స్త్రీలు మరీ ఆనందంతో పూజలు జరిపారు.

## ఒట్టు వేసుకోవడం

ఒట్టు వేసుకోవడం–ప్రమాణం చెయ్యడం–చాలా పురాతనమయిన ఆచారం. ఇది ప్రపంచంలో అన్ని దేశాలలోను ఉన్నదే. మనిషి తాను చెప్పిన మాటలు సత్యమనీ, తాను ఆ మాటకు విరుద్ధంగా ప్రవర్తించననీ, రూఢి చెయ్యడానికి ఒట్టు వేసుకుంటాడు. ఈ ఒట్టు వేసుకొనే పద్ధతి చూదాం: దేవునిమీదా, ప్రియమైన బంధువులమీదా, ప్రాణపదమయిన వస్తువులమీదా, పెట్టి ఒట్టు వేసుకుంటారు. దేవతావిగ్రహం ముట్టుకుంటూ తాను చెప్పే మాట చెప్పుతాడు. దైవ స్వరూప మనుకుంటున్న బైబిల్, ఖురాన్ మొదలయినవాటిని తాకుతూ ఆమాట చెప్పుతారు. కొందరు దేవతా ప్రసాదం చేతిలో పట్టుకొనిగాని, తీర్థం సేవించిగాని ఆమాట అంటారు.

అర్థం ఏమిటి ? ఈ మాటకు తప్పినట్టయితే నేను ఈ దేవతకు అపరాధం చేసినవాడ నవుతాను; ఈ దేవత ఆగ్రహానికి గురి ఔతాను. దానికి తగిన శిక్షకు పాత్రుడనవుతాను అని ప్రతిజ్ఞ చేస్తున్నాడన్నమాట. ప్రియమయిన బంధువులు, ప్రియతమయిన వస్తువులు– అటువంటి వాటి మీద ఒట్టు పెట్టుకుంటే దాని అర్థం "మాట తప్పినట్టయితే పైవాటికి దూర మవుతాను" అన్నమాట.

పూర్వపు ఆచారం ఏమిటంటే. దేవతా విగ్రహం దగ్గరలోవుంటే ఆ విగ్రహాన్ని ముట్టుకుంటూ చెప్పడం – అలాగే దేవతా విగ్రహం దగ్గరగా లేకపోతేనో ? దేవతా మహత్యంకలిగి, అన్నివిధాలా అర్చనలనూ, పూజలనూ, పొందుతూ ఉండే స్త్రీ పురుష గోప్యంగా ఉన్నాయి కదా ?

వాటిని ముట్టుకుంటూ మనుష్యులు ఈ ఒట్టులు పెట్టుకొనేవారు. క్రీస్తు పూర్వము ఆ దేశాలలో ఈ అలవాటు బాగా ఉండేది. కొన్ని ఆ కాలపు దేవతా చిత్రాంలో పురుషులు తమ గోప్యాంగం పట్టుకుంటూ ప్రమాణం చేసినట్లు ప్రత్యక్షంగా కనిపిస్తుంది. ఇలాంటి చిత్రాలు కొన్ని అక్కడ క్కడ, కొన్ని మ్యూజియములలోనూ, పురాతన పుస్తకాంలోనూ ఇప్ప టికీ చూడవచ్చును.

తరువాత తరువాత, కొంచెం నాజూకుతనం కలిగినప్పుడు పాపం! పబ్లిక్ న్యాయస్థానాలలోనూ, పద్యుల సమాజములోనూ ఈ పని చేయ డానికి కొంచెం సంకోచించారు. దీనికి బదులుగా, "చేయి తొడ కింద పెట్టి" ప్రమాణం చేయడం వాడుకలోనికి వచ్చింది. దీని అంతరార్థం ఏమిటో వేరుగా చెప్పనక్కరలేదు గదా! తొడకింద చెయ్యిపెట్టి చెప్పు తున్నాను అంటే, గోప్యాంగం పట్టుకొని చెప్పుతున్నాను అనీ దేవతా విగ్రహాన్ని ముట్టుకొని చెప్పుతున్నాను అనీ అర్థం చేసుకోవాలి. ఈ ఆచా రం ఉండినట్టు బైబిల్‌లోనూ, రెండువేల సంవత్సరాల యితర దేశ గ్రంథాలలోనూ నిదర్శనాలున్నాయి.

ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఎప్పుడయితే పంట దేవతం మీది గౌరవం లింగంమీదకు యోనిమీదకు ప్రసరించిందో, అప్పుడే ఈ గోప్యాం గాలు దైవత్వం పొందాయన్నమాట—వారి దృష్టిలో అప్పుడు ప్రమాణాలు ఈ రూపంగా ఉండడం న్యాయమే కదా!

పభ్యభావాలు అధికమయిన తరువాత ఈ ప్రమాణాల రూపం మారుతూ వచ్చింది. ఒకొక్కక్కరు 'తల్లితోడు', 'అక్కతోడు'అంటారు. ఈ ఒట్టులో ఇంకా ఆ గోప్యాంగ సంపర్కం కొంచెం కనిపిస్తూంది. ఎదుటివారిని కట్టడి చెయ్యాలంటే 'నమ్మ చంపుకు తిన్నట్టు' అని స్త్రీలు అంటూ ఉంటారు. మరికొంచెం నాజూకు అయిన ప్రబంధనాయికలు

"నా కన్నుల యాన, నావలపు కస్తురి నామముతోడు" ఇలాంటి కవిత్వంతో ఒట్టు పెట్టుకోవడం ఆరంభించారు. దీనిని బట్టి ఈ ఒట్టు వేసుకోవడం అన్న ఆచారమే నిలిచిందనీ, దాని అసలు అర్థం మరిచి పోయారనీ వేరే చెప్పనక్కరలేదు గదా! ఒట్టులో ఉన్న ఆ భయంకర భావం నశించిందని తేటపడుతూ ఉంది కదా!

## ఇంకా ఈ ఆచారమెందుకు?

ఇప్పుడు న్యాయస్థానాలలో సాక్షులచేత ప్రమాణం చేయిస్తుంటారు. నిజం చెప్పిన సాక్షీ ఆ ప్రమాణమే చేస్తాడు. కూటసాక్ష్యం చెప్పినవ్యక్తి గూడా ఆ ప్రమాణమే చేస్తాడు. అంటే ప్రమాణం మీద గౌరవభావం అంతరించి పోయిందనేకదా! ఈ సందర్భంలో ఆ ప్రమాణం చేయించడం వల్ల ప్రయోజనం ఏముంది అని అడగవలసివస్తుంది. అనవసరంగా వాళ్ళ చేత దేవుడిని కోర్టులోనికి తెప్పించడం ఎందుకు? దాని నిష్ప్రయోజకతను ప్రకటించడ మెందుకు? అబద్ధపు సాక్ష్యం చెప్పినట్టు రుజువయితే, వాడిని శిక్షించడానికి తగినట్టు వేరేఉపాయం ఆలోచించడం మంచిదికాదా. రోజులు మారిపోయి, ఆచారం నిరుపయోగం అయినప్పుడు ఆ ఆచారం విడిచి పెట్టుకోడానికి వెనుక తీయడం ఎందుకు అని మనవి చేస్తాను.

## ఉపసంహారం:

ఇలాగ జరిగింది ఈ వ్యవహారం. దేవుడు అంటే ఆ రోజులలో వాళ్ళకున్న అభిప్రాయాన్ని బట్టి వంగమ సమర్పణ మహా పవిత్రమైన కార్యం అయింది. ఆ కార్యానికి దేవాలయాలు మూలస్థానాలయాయి. వంగమ బుద్ధికి ఉద్రేకం కలిగించే విషయాలన్నీ దేవాలయాలకి ముఖ్య

మైన అంగా లయాయి. కాబట్టి కోవెలలు రతి కళామందిరాలలాగ తయారయాయి. బూతు బొమ్మలతో, గుడిచేటులతో నపుంసక పండితులతో, విశ్య సంగమాలతో, దేవాలయాల ఆకారంగానే రథాలూ చేస్తారు. కాబట్టి రథం కట్టినప్పుడు గూడా ఈ బూతుబొమ్మలు ఇరికిస్తారు శాస్త్రసమ్మతం గాను. అందుచేతనే భగవంతుడు యోని లింగాకారంగా ఉండడం తటస్థించింది. రాను రాను బూతు పనులు పోయి బోడిగుళ్ల తయారయాయి పుణ్యక్షేత్రాలలో.

ఈ విషయం అంతా సక్రమంగానూ, సంపూర్ణంగానూ చెప్పాలంటే ఇంకా చాలా ఉంది. నేను ఈ సంగతి అంతా టూకీగా చెప్పాను. చెప్పవలసింది అభిప్రాయ పరివర్తనం. దేవతారాధన అంటే ఎలాంటి మార్పులు చెందిందో వ్రాయవలసి వచ్చింది. సందర్భంకొద్దీ కొంతబూతు వ్రాయక తప్పింది కాదు. శాస్త్రవాదనలో ఇలాంటివాటికి పాఠకులు తప్పుపట్టరని నమ్మకం ఉంది. అక్కడక్కడ చెప్పిన సంగతులు మనకి కొంచెం కటువుగా తగలవచ్చును. కాని వాస్తవం వ్రాయడం తప్పుకాదనుకుంటాను.

అందులోనూ మన దేశంలో కేవల నిర్గుణ బ్రహ్మోపాసననుంచి ఉచ్చిష్ట గణపతి ఉపాసన వరకు, అన్ని రకాల ఉపాసనలూ ఉన్నాయి. నరబలి మొదలు ఆత్మబలిదానం వరకూ అన్ని అంతస్తులూ ఉన్నాయి. కీడు తియ్యడం, సంతానంకోసం కోవెలలో మూడు రాత్రులు నిద్రచేయడం మొదలైన ఆచారాలున్నాయి. వల్లభాచార్య మహరాజ్ భోగలాలస మతాధిపతులూ వామాచారుల మతాలు, లింగబసివి సమూహాలు, గరుడ బసివి సంఘాలు ఇప్పటికీ ఉన్నాయి. లింగపూజలు, భగపూజలు, సిడిమానులు, రవికెల పండుగులు అన్నీ సభ్యతలో వచ్చిన పరిణామాలనూ మరచిపోనివ్వవు.

ఇటువంటివాటి నన్నిటినీ చారిత్రక దృష్టితో పరిశీలించి చూడాలి. అప్పుడు దేశ దేశాలలోని ఆచారాలలో కనిపిస్తున్న వ్యత్యాసాలు నిజంగా వ్యత్యాసాలు కావని తేటపడుతుంది. సంస్కృతి మార్పులలో ఏర్పడిన అంతస్తులే అని స్పష్టమవుతుంది. ఆ యా అంతస్తులు ఎప్పుడో ఒకప్పుడు అన్ని జాతులకు కలిగినవో, కలుగవలసినవో అని తెలుస్తుంది. అప్పుడు వారిని చూచి వీరు అసహ్యించుకోవలసిన పనిగాని, వీరిని చూచి వారు ఈసడించవలసిన అవసరంగాని ఉండకుండ పోతుంది. అందరము ఒక్క మహాసంస్థలోని వారమే అని బోధపడుతుంది. కాబట్టి, ఈ వ్రాతలకు నేను క్షమార్పణ చెప్పుకోవలసిన అగత్యం ఉండదనుకుంటాను. అయినా క్షమించండి.

## చెప్పరావడం ఏమిటి?

ఆ అభిప్రాయాలు మారిపోయినాయి. ఆచారాలు కొంత పరివర్తనం పొందాయి. ఇంకా మన శాస్త్రాలు మాత్రం అలాగే ఉంచాను. శాస్త్రాలలోనూ మార్పు చెయ్యరు. ఇప్పుడు ఒక కోవెల కట్టాలంటే ఏమూలనో ఒకమూలను ఒకబూతుబొమ్మ ఉంచాలి అంటారు. ఒక దేవతా విగ్రహం చెయ్యాలంటే దానికిపెద్ద పెద్ద స్తనాలూ, అవయవాలూ ఉండా లంటారు. అంతేకాని ఆ అభిప్రాయాలు పోయినాయి కాబట్టి సూత్రాలు కూడా పోవాలి అనరు. అదే మనకి వచ్చిన అనర్థం. ప్రపంచం అంతా మారిపోతూ ఉన్నా, సూత్రాలు మాత్రం మార్పుం. అందుచేత సూత్రాలకి జీవితాలకీ మధ్యను పర్వతాలు పెరిగిపోతూ ఉంటాయి. సముద్రాలు అడ్డమయి పోతూఉంటాయి. అదే అనర్థం. అదే సుఖజీవనాన్ని అడ్డగిస్తుంది.

అభివృద్ధిని అరికడుతూ ఉంది. ఇది ఒకదానిలోనూ రెంటిలోనూ కాదు. మన విద్యలో, మన సంఘజీవనంలో, మన భోజనాలలో, మన వివాహాలలో, మన చావులలో అన్నిటిలోనూ ఈ పాత సూత్రాలూ కొత్త జీవనమూ ఢీకొంటూనే ఉంటాయి. సూత్రాలను జీవితంతో మేళవించడం మంచిపని. అది జరగనంతవరకూ మనం గొర్రెలమందలాగ ఉండవలసిందే. ఆ సమన్వయమే కలిగిందంటే, అన్నీ చక్కబడతాయి.

ఈ సంగతులను గురించి చదివి సంగ్రహించినది చాలా వుంది. అలాంటి భోగట్టా మనవాళ్ళకి తెలియజేస్తే, ఉన్నది ఉన్నట్టుగా, కొన్నాళ్ళకయినా నేను చెప్పిన సమన్వయం కలగవచ్చును అని నా ఆశ. అందుచేతనే ఈ వ్యాసాలు ఇప్పటికి వ్రాశాను. అంతేకాని విషయంలోంతా కాదు, వాగ్లోంతా కాదు.

## తాపీ ధర్మారావుగారి ఇతర రచనలు

### దేవాలయాల మీద బూతు బొమ్మ లెందుకు?

కోవెలంటే ఏమిటి? దేవాలయాలు – శోభనపు గదులా, మనలో బూతు, ఏమిటీ అనాచారం? కోవెలల మీదనూ, లోపలనూ, ఆ బూతు బొమ్మ లెందుకుండాలి? ఈ వెంట్రుకల మొక్కుబడులేమిటి? ఆ దేవత విగ్రహం అలా ఎందుకుంది?–ఇలాంటి ప్రశ్న పరంపరంతో సాగిపోతుంది తాపీవారి ఈ రచన.

### పెళ్ళి దాని పుట్టు పూర్వోత్తరాలు

పెళ్ళి అంటే ఏమిటి? ఈ పెళ్ళి తతంగం అంతా మొదటినుంచీ యిలాగే ఉంటూ వచ్చిందా? వివిధ సాంఘిక దశల్లోని అలవాట్లు ఆచారాలు విశ్వాసాలు యీ తతంగంలోకి ఎలా సంతరించబడ్డాయి? మొదలైన ఎన్నో విషయాల్ని వివరించే రచన.

### కొత్త పాళీ

భాషాభిషక్కుల భేషజాన్ని బైటపెట్టి గిడుగు పిడుగు వ్యావహారిక భాషకు ఎనలేని సేవ చేశారు. కాని ఆయన రచనలు పండితుల వాదనం కిందనే చెలామణి అయిపోయాయి. సాధారణ ప్రజలకుకూడా ఈ వివాదంలోని విషయం తెలిస్తే వ్యావహారికం ప్రచారం చాలా సులభ మవుతుందని గ్రహించిన తాపీ ధర్మారావుగారు ప్రజాసామాన్యానికి నిజం చెప్పుదామని తలచి చేపట్టినదే ఈ 'కొత్తపాళీ'.

### సాహిత్య మొర్మరాలు

### విజయ విలాపము (హృదయోల్లాస వ్యాఖ్య)

### అవ పిప్పి పీత శ్లేవా (నాటికలు)